శ్రీ

# నేత్రదర్పణము.

ఇయ్యది

పురాతనకవీశ్వరుఁడగు

తాడిపల్లి పానకాలరాయునిచేత

రచియింపఁబడి,

దంతశోధని, వ్రణచికిత్స, ఆరోగ్యదర్పణము, మొదలయిన

వైద్యగ్రంధములనురచియించిన,

బ్రహ్మశ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారిచే

సంస్కరణముపొంది, టీకాతాత్పర్యములువ్రాయఁబడి,

అక్కిన వేంకటరత్నముచే

ఏలూరు

మంజువాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రకటింపఁబడెను.



మొదటికూర్పు 3000 ప్రతులు.

ఏలూరు

---

దీని వెల ౩ అణాలు.

1918

---

# విజ్ఞాపనము.

ఆర్యులారా!

నేనీగ్రంథమును సంపాదించి చాలదినములైనను, దీనిని ప్రకటనలోనికిఁ దేవలెనను తలంపు మాత్రము నాకుఁగలుగలేదు. ఏమనఁగా దీనిని సంపాదించిన తర్వాత నేనాకు వైద్యము చేయుట యందభిలాషము మిక్కుటముగానుండుటచేఁ బ్రాహ్మణులగు కొందఱియొద్దఁ గొన్ని సంగతులు నేర్చుకొని యిందలి నేత్రవైద్యములు చేయుచుఁ జాలమందికి రోగములు నివారింపఁ జేయుచుండుటచే, ఈగ్రంథమందునాకు, ఎక్కువ గౌరవముగలిగి ఈగ్రంథమును ముద్రించినచో నా వైద్యమునకేమి లోపముగలుగునో యనుదురభిప్రాయముతో వెల్లడింపక, గ్రంథమున్న సంగతియే యెవ్వరికిందెలుపక దాచిదాచియుంచి కాలక్రమమున నాకేప్రకటించిన నెల్లరకు నుపకారముచేసిన వాఁడనగుదునను తలంపుపుట్టి, జీర్ణదశనుబొంది లేఖకుల కారణమున నెన్నియోతప్పులతోనిండి సర్వజన సాధారణముగా నర్థముగాని యీ వ్రాతప్రతిని నామిత్రులగు బ్రహ్మశ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారి యొద్దకుందీసికొనిపోయి "యీగ్రంథమును సవరించి టీకా తాత్పర్యములు వ్రాసిముద్రింపించుట కనువుగా నుండునట్లుచేయుఁ" డని కోరిచూపించగా, చూచియొకటిరెండు పద్యములంజదివి "యిందన్నివిషయములును పొరపాటులతో నిండియున్నవి. సవరించుటకు దీర్ఘకాలముపట్టును. తగినంతతీరికనాకులేదని" పలుకగా, ఎట్లయినను మీరేసవరించి యుద్ధరింపవలయునని పట్టుబట్టినమీఁదట వారంగీకరించి యీమహాకార్యము నొనర్చినందులకు నేనుమితిలేని యానంద మొందెంది వారియెడం గృతజ్ఞుఁడనైయుంటిని. ఈగ్రంథ మెట్టిదశలోనుండఁగా నెట్లుబాగుచేయుటకు శ్రమపడియున్నారో చూచినవారికిఁ దెలియుటకొఱకు, నేనిచ్చిన వ్రాతప్రతియందలి యొకపద్యము నీక్రిందనుదహరించుచుంటిని. కాఁబట్టి, ఆర్యులగు మీరీపద్యమును జదివిచూచి గ్రంథములో సవరింపఁబడిన పద్యమును ముందుగఁ జూడక యిచట నుదహరించిన పద్యమును, సరిచేయు తలంపుతో నొక పావుగంట తర్కించినయెడల వీరికి సంస్కరణమెంత ప్రయాసమును గలుగఁజేసినదో తెలియకమానదు. ఎట్లనఁగా:—

### 7. అభయాంజనము.

ఉ. నేద్దులవంగముల్ పటిక నిప్పులమీదను యామదంబునన్
బీతిగకరకచెక్కలును పేల్చసమంబుగ మావువెన్నతో
పవుడపుకంచుపళ్ళెరము తొమ్మిదినాం దెగనూరివేళ్ళయమ
ర్ఖాళింతపునేత్రరోగకుల జాలముమానును రుక్మిణీశ్వరా. (అని వ్రాతప్రతి)

సవరణ కాఁబడిన పద్యముఁగూడ నిచ్చటనే చూపించిన సవరించు శ్రమయెట్టిదో యెరుకపడదుగాన నాపని నేనుచేయుట విడిచి చదువరుల పయింబెట్టితిని. హంసక్షీర న్యాయమున గుణగ్రాహులిందలి గుణమునే గ్రహింతురుగాకయని కోరుచున్నాఁడను. ఈ గ్రంథమునందుఁ బ్రయోగించుచువచ్చిన రసవిష గంధకాదుల శుద్ధులు చక్కఁగాఁజేసివాడుకొనుట సమంజసము.

ఇట్లు విన్నవించువిధేయుఁడు,

అక్కిన వేంకటరత్నము.

ఓమ్.

శ్రీసద్గురవేనమః.

మ. అవనిన్మర్త్యుల మ్రొక్కులందిదయతో నారోగ్యముల్ లోకబాం
ధవుఁడై యిచ్చుచు దవ్వుఁజెందియును మిత్రఖ్యాతిఁ బెంపొంది వేఁ
డివెలుంగుంగల దయ్యమయ్యుఁ బరిపాటి న్శీతలాంభఃప్రదుం
డవు నారాయణమూర్తి పోల్చుతను నిత్యంబుల్ జగచ్చక్షుఁడై.

శ్లో॥ గురుర్బ్రహ్మగురోర్విష్ణుగురుదేవోమహేశ్వరః।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః॥

మంత్రము.

ఏవంగుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ. గోత్రస్య, నామధేయస్య, ఆయుష్యా భివృద్ధ్యర్థం శ్రీసూర్యనారాయణ నమస్కారం కరిష్యేనమః.

శరీరేవర్తమాన వర్తిష్యమాన వాత పిత్త కఫోద్భవ నానాకారణ జ్వర, క్షయ, కుష్ఠు, శూలాతిసార, పాండు, ధాతుక్షయ, వ్రణ, మేహ, భగంధరాది సమస్తామయ నిబర్హణార్థం హరిహరనామాత్మక త్రయీమూర్తయే భగవతే ఛాయాసమేత శ్రీ సూర్య నారాయణ నమస్కారం కరిష్యేనమః.

శ్లో॥ ధ్యేయస్సదాసవితృమండలమధ్యవర్తి నారాయణస్సరసిజాసనసన్నివిష్టః।
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటి హారి హిరణ్మయవపుర్ధృతశంఖచక్రః॥

శ్లో॥ భానోభాస్కరమార్తాండ చండరశ్మిదివాకరః।
ఆరోగ్యమాయుర్విజయంశ్రేయఃపుత్రాంసిదేహిమే॥

శ్లో॥ ఆదిదేవనమస్తుభ్యంప్రసీదమమభాస్కర । దివాకరనమస్తుభ్యంప్రభాకర నమోస్తుతే।

మంత్రము.

మిత్ర, రవి, సూర్య, భాను, ఖగ, పూష, హిరణ్యగర్భ మరీచయేనమః। ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి॥

మూలము.

హ్రాం, హ్రీం, హ్రూం, హ్రైం, హ్రౌం, హ్రః శ్రీఛాయాపద్మినీ ఉషా సమేత శ్రీసూర్యనారాయణ పరబ్రహ్మణేనమః॥ నమస్కారాన్ సమర్పయామి॥

౧౦౮ సారులు జపముచేయవలెను.

శ్రీ

శుభమస్తు.

# నేత్రదర్పణము.

క. శ్రీకరయాదవకులర ! త్నాకరసంపూర్ణతరసుధాకరవరద
ర్వీకరరాణ్మృదుతల్పద ! యాకరగోపాలత్రిభువనావనఖేలా.

టీ. శ్రీకర=శోభను చేయువాఁడా. యాదవకులరత్నాకర=యాదవవంశమను సముద్రమునకు, పూర్ణతరసుధాకర=నిండు చంద్రునివంటివాఁడా. వర=శ్రేష్ఠమైన, దర్వీకర=సర్పమయిన ఆదిశేషువు, మృదుతల్ప=మెత్తనయినపరుపుగాఁగలవాఁడా. దయాకర=కరుణకు స్థానభూతుఁడయినట్టివాఁడా, త్రిభువన=ముల్లోకములను, అవన=రక్షించుటయందు, ఖేలా=ఆసక్తిగలవాఁడా, గోపాలా=ఓగోపాలమూర్తీ.

తా. యాదవవంశమను సముద్రమునకుఁ బూర్ణచంద్రునివంటివాఁడును, శేషశాయియు, ముల్లోకములను రక్షించుటయందాసక్తిగలవాఁడును, దయాస్వరూపుఁడును, శోభనుజేయునట్టివాఁడునైన గోపాలుఁడను నామముతోఁ బ్రకాశించు విష్ణుదేవునింగూర్చి సంబోధనము

వ. అవధరింపుము.

సీ. శ్రీశగిరీశవాణీశులఁ బ్రార్థించి మా సతీవాగ్వధూమణులఁ దలఁచి
ఆంబికేయాంజనేయాశ్వనేయాదితేయాదులనాత్మలోనభినుతించి
వాల్మీకి శ్రీశుక వ్యాసాదులగునట్టిఋషివర్యులకు నమస్కృతులొనర్చి
బాణమాఘమయూర భవభూతితిక్కనకాళిదాసాదిసత్కవుల దలచి
భావికవులను భావించి భావమలర
నొకవిధంబున కుకవులకొప్పఁబలికి
వర్తమానకవీంద్రవిఖ్యాతిఁబొగడి
యాదివైద్యులనెల్లరనభినుతింతు.

టీ. శ్రీశ=విష్ణుమూర్తిని, గిరీశ=సాంబమూర్తిని, వాణీశ=బ్రహ్మదేవుని, ప్రార్థించి=ప్రార్థనజేసి, మా=లక్ష్మిని, సతి=పార్వతిని, వాగ్వధూమణిన్=సరస్వతిని, తలఁచి, ఆంబికేయ=గణనాథుని, ఆంజనేయ=హనుమంతుని, ఆశ్వనేయ=ఆశ్వనేయులను, ఆదితేయాదులన్= దేవతలు మొదలయినవారిని, ఆత్మలోన్=మనస్సునందు అభినుతించి=స్తోత్రముచేసి, వాల్మీకి=వాల్మీకియు, శ్రీశుక=శ్రీశుకుఁడు, వ్యాస=వ్యాసుఁడు, ఆదు

లగునట్టి=మొదలయిన, ఋషివర్యులకు=ఋషిశ్రేష్ఠులకు, నమస్కృతులు=వందనములు ఒనర్చి=చేసి, బాణ=బాణకవి, మాఘ=మాఘకవి, మయూర=మయూరకవి, భవభూతి=భవభూతియనుకవి, తిక్కన=తిక్కనకవి, కాళిదాస=కాళిదాసకవి, ఆది=మొదలయిన, సత్కవులన్=సత్కవీశ్వరులను, తలఁచి=ధ్యానించి, భావికవులను=ముందుబయలుదేరుకవులను, భావించి=భావమునదలఁచి, భావమలరన్ = అభిప్రాయ మొప్పునట్లు, ఒకవిధంబునన్=ఒకరీతిగా, కుకవులకు=కుత్సితకవులకు, ఒప్పు బలికి=ఒప్పునట్లు పచించి, వర్తమాన=జరుగుచున్న, కవీంద్ర=కవీశ్వరులయొక్క విస్ఫూర్తిన్=అతిశయమును, పొగడి=స్తవముజేసి, ఆదివైద్యులెల్లరన్=పూర్వము ప్రసిద్ధినందియున్న వైద్యులనందఱిని, అభినుతింతు=స్తోత్రముచేయుచున్నాను.

తా. బ్రహ్మవిష్ణుమహేశ్వరులను ప్రార్థించి ఉమాలక్ష్మీసరస్వతులను తలచి, గణనాథ, అశ్వనేయాదిదేవతలను, అభినుతించి, వాల్మీకిమొదలయిన ఋషులకు నమస్కారములుచేసి, బాణుఁడు మొదలగు భూతభవిష్యద్వర్తమాన కవులంబొగడి పురాతనవైద్యులనుతింతునని.

వ. ఇట్లెల్లవేల్పులనెల్ల సూరుల మంగళాయతనంబుగఁ బొగడి కవితోద్యోగానురక్తుండనై మదీయాన్వయప్రకారం బభివర్ణించెద.

సీ. రాజాధిరాజవిరాజితసత్పరిపాటియైనదికొండవీటిసీమ
సకలవర్ణాశ్రమాచారసత్కర్మబాహాటమైనదికొండవీటిసీమ
సంగీతసాహిత్యసరసవిద్యలనిరాఘాటమైనదికొండవీటిసీమ
అతులితానర్ఘ్యవజ్రాకరవితతిచేఁబాటిల్లినదికొండవీటిసీమ
ప్రకటితైశ్వర్యసౌఖ్యసంపదలఁబొదల
నఖిలజనములకానందమతిశయిల్ల
జగతినేబదియారుదేశములలోన
నీటుగానెన్నఁదగుకొండవీటిసీమ.

టీ. రాజాధిరాజ=చక్రవర్తులతో, విరాజిత=ప్రకాశింపఁబడిన, సత్పరిపాటియైనది=యోగ్యమగుపరిపాటికలదియు, సకలవర్ణాశ్రమాచార=సర్వమతములయొక్క, ఆచారములతోఁగూడిన,సత్కర్మ=యోగ్యమగుకర్మలచే,బాహాటమైనది=ప్రఖ్యాతినిబొందినదియు, సంగీత=గానము, సాహిత్య=సాహిత్యము మొదలయిన, సరసవిద్యలన్=సరసమయినవిద్యలచేతను, నిరాఘాటమైనది=అడ్డులేనిదియు , అతులిత=సమాన రహితమయిన (అనఁగానీడులేని) అనర్ఘ్య=వెలలేని , వజ్రాకర=వజ్రములతోఁగూడిన , వితతిచేన్=సమూహముతో , పాటిల్లినది=పేరుపొందినదియు , ప్రకటిత=ప్రచురమయిన, ఐశ్వర్య, సౌఖ్య, సంపదలన్=ఐశ్వర్యము, సౌఖ్యము, సంపత్తుచేత , పొదలన్=వృద్ధి

పొందఁగా, అఖిలజనములకు=సమస్తప్రజలకును, ఆనందము=సంతోషము, అతిశయిల్లక=వృద్ధిపొందఁగా, జగతిక=ప్రపంచమందు, ఏబదియారుదేశములలోనక=కొండవీటిసీమ, నీటుగాక=అందముగా, ఎన్నదగుక=ఎంచవచ్చును.

తా. కొండవీటిసీమ రాజాధిరాజులచేతను, సకలవర్ణాశ్రమధర్మముల చేతను, సర్వవిద్యలచేతను, సర్వమణులచేతను, ఏబదియారుదేశములలోను వన్నెకెక్కినదయి సమస్తజనులకు హర్షమునిచ్చుచుండెనని యెంచవచ్చును.

వ. అట్టిసీమాప్రదేశమున నుదగ్భాగంబున నింద్రకీలాచలంబునకు మధ్యప్రదేశంబు మంగళాచలంబునంగల కృష్ణానదీతీరంబున.

క. పదిరెండుపర్వతంబులు। విదితంబుగ నదులు రెండు విభుఁడు నృసింహుం
డదనైనదుర్గమొక్కటి। పదపడి ముదమలరు తాడిపల్లిధరిత్రిక్.

టీ. పదిరెండుపర్వతంబులు=పండ్రెండుపర్వతములును, విదితంబుగక=ఏర్పాటుగా, నదులు రెండు=రెండునదులును, విభుఁడు=ప్రభువు, నృసింహుండు=నరసింహమూర్తియు, అదనైన=అనుకూలించిన, దుర్గమొక్కటి=ఒకదుర్గమును, పదపడి, తాడిపల్లి=తాడిపల్లియను గ్రామము, ధరిత్రిక=భూమియందు, ముదమలరుక=సంతోషముగా నొప్పును.

వ. అందు.

సీ. శ్రీవత్సగోత్రుఁడంచితపటుశాస్త్రసం
ఖ్యావనీదేవకులాగ్రగణ్యుఁ
డగుతాడిపల్లిరంగామాత్యపుత్రుండు
రాజపూజ్యుఁడు సుబ్బరాయఁడతని
తనయుఁడౌ వెంకన్నకును మహాలక్ష్మాంబ
కును తనూజులముమ్మరు ముగురమునందు
చెలఁగి వెంకటరాయశ్రీసీతపతిరాయ
లకు సహోదరుడ నేబ్రకటముగను.
పానకాలార్యుఁడను వాఁడభవ్యయశుఁడ
నఖిలరాజాధిరాజసభాంతరాగ్ర
పూజితుఁడ సర్వవిద్యావిరాజితుఁడను
సుజనసేవ్యుఁడ హరిభక్తిసుమహితుడను.

టీ. శ్రీవత్సగోత్రుఁడు=శ్రీవత్ససగోత్రమునందు జన్మించినవాఁడు, అంచిత=ఒప్పునట్టి, పటు=పటుతరమైన, శాస్త్ర=శాస్త్రములయొక్క, సంఖ్యా=మొత్తముతోఁ గూడి, అవనీదేవకులాగ్రగణ్యుఁడగు=బ్రాహ్మణవంశశ్రేష్ఠుఁడగు, తాడిపల్లి రంగామాత్య పుత్రుఁడు, రాజపూజ్యుఁడు=రాజులచే పూజింపఁదగినవాఁడు, సుబ్బరాయుఁడు, అతని తనయుఁడౌ=అతని కుమారుఁడయిన, వెంకన్నకును, మహాలక్ష్మాంబకును, తనూజులము ముగ్గురము=ముగ్గురు కుమారులము, అందు=ముగ్గురిలో, చెలఁగి=ఒప్పి, వెంకటరాయ, శ్రీసీతాపతిరాయలకు, ప్రకటముగన్=ప్రచురముగా, నేన్=నేను, సహోదరుఁడన్=తమ్ముఁడను, (అనఁగాఁ జిన్నవాఁడనుట) పానకాలార్యుఁడనువాఁడన్=పానకాలరాయఁడను పేరుగలవాఁడను, భవ్య=మంగళప్రదమయిన, యశుఁడన్=కీర్తి కలవాఁడను, అఖిల=సమస్తమయిన, రాజాధిరాజ=పెద్ద పెద్దలగు చక్రవర్తుల యొక్క, సభాంతరాగ్ర=సభామధ్యములయందు, పూజితుఁడన్=పూజింపఁబడువాఁడను, సర్వ విద్యావిరాజితుఁడను=సకల విద్యలచేతను, ప్రకాశించువాఁడను, సుజనసేవ్యుఁడన్=సుజనులచేత సేవింపఁబడువాఁడను, హరిభక్తి=విష్ణుభక్తిచేతను, సుమహితుఁడను=ఒప్పునట్టివాఁడను.

ఉ. నెమ్మది వైద్యశాస్త్రములనేకములారసి నేత్రవైద్యయో
గమ్ములు కట్లుపట్లు తగుకాటుకలౌషధనస్యపథ్యతై
లమ్ములు శస్త్రసాధనలు లక్షణమొప్పఁగ నాంధ్రభాషచే
గ్రమ్మన నేరచింతునొక గ్రంధము లోచనదర్పణంబనన్.

టీ. నెమ్మదిన్=నిండుమనస్సుతో, వైద్యశాస్త్రములు, అనేకములు=విస్తారము, అరసి=పరిశోధించి, నేత్రవైద్యయోగమ్ములు=నేత్రవైద్యముయొక్క కట్టుబాట్లును, కట్లు=కట్లుకట్టుటయు, పట్లు=పట్లువేయుటయు, తగు=ఒప్పునట్టి, కాటుకలు=అంజనములును, ఔషధమున్=మందులును, నస్య=నస్యములు. పథ్య=పథ్యములు, తైలమ్ములు=ద్రవరూపములగు చమురులును, శస్త్రసాధనలున్=శస్త్రములు చేయు నుపాయములును, లక్షణమొప్పఁగన్=శాస్త్రలక్షణములతో నొప్పునట్లు, లోచనదర్పణంబనన్=నేత్రదర్పణమను పేరితో, ఆంధ్రభాషచేన్=తెలుఁగుబాసతో, గ్రమ్మనన్=యుక్తముగా, నేన్=నేను, రచింతున్=చేయుదును.

తా. అనేకములగు వైద్యశాస్త్రములను పరిశోధించి కట్లు, పట్లు, కాటుకలు, తైలములు, ఔషధములు, నస్యములు, పథ్యములు, శస్త్రసాధనలు మొదలయిన వాని నన్నిటిని జేర్చి శాస్త్రయుక్తముగా, ఆంధ్రభాషలో నేత్రదర్పణమను పేరితో నొక గ్రంథమును నేను చేయుదును.

క. విద్యలలోపల నుత్తమ। విద్యయనందగిన వైద్యవిద్యకు మఱియే
విద్యలు సరిగావెప్పుడు। వైద్యంబు పరోపకారవైభవమొసఁగున్.

టీ. విద్యలలోపలఁ=సకలవిద్యలలోను, ఉత్తమవిద్య=ప్రశస్తమయిన విద్య, అనందగిన=అనఁగానొప్పిన, వైద్యవిద్యకు=వైద్యశాస్త్రమునకు, ఎప్పుడుఁ=ఎన్నఁడును మఱియేవిద్యలు=తక్కినయేయితర విద్యలును, సరిగావు=సమానముకావు. వైద్యంబు=వైద్యము, పరోపకార=ఇతరులకు మేలు జేయు నట్టి, వైభవము=విభవమును, ఒసఁగుఁ=ఇచ్చును.

తా. అన్నివిద్యలలోను వైద్యవిద్య పశ్రస్తమయినదనియు వైద్యము పరులకుపకారము చేయునదనియును.

సీ. అర్థిపరోపకారార్థమిదంశరీరంబని శ్రుతివచనంబు దెలుప
తనరధర్మోవివర్థతియంచు నెప్పుడు శాస్త్రిపురాణముల్ చాటుచుండ
గురుతుగా ధర్మస్య త్వరితాగతియటంచు సాధుసంఘంబు హెచ్చరిక సేయ
నరయ సమస్తలోకాస్సుఖినోభవంతని వేదవేత్తలొయ్యనవచింప
వినుచు బాగుగ నేరాజు కనికరమున
మొదట రోగార్తజనులను బ్రోచుకొఱకు
వైద్యులను నిల్పునత్యంత వైభవమున
నతనిపుణ్యంబు బ్రహ్మకునైన గలదె.

టీ. అర్థిఁ=కోరికతో, పరోపకారార్థమిదంశరీరంబని=ఈశరీరము పరోపకారనిమిత్తమేయని, శ్రుతివచనంబు=వేదవాక్యము. తెలుపఁ=తెలియఁజేయంగా, తనరఁ=ఒప్పు నట్లుగా, ధర్మోవివర్థతియంచు=ధర్మము వృద్ధి యగుచున్నదని, ఎప్పుడుఁ=ఎల్లప్పుడును, శాస్త్ర=శాస్త్రములును, పురాణముల్=పురాణములును, చాటుచుండఁ=వెల్లడి చేయుచుండఁగా, గురుతుగాఁ=నిదానముగా, ధర్మస్యత్వరితాగతి=ధర్మము చేయుటకు తొందరపడుము, అటంచు=అనుచు, సాధుసంఘంబు=సజ్జనసముదాయము, హెచ్చరికసేయఁ=ప్రోత్సాహము సేయఁగా, అరయఁ=ఆలోచించగా, సమస్తలోకాస్సుఖినోభవంతని=సమస్తమయిన ప్రజలును సుఖవంతులగుదురుగాక యని వేదవేత్తలు=వేదము తెలిసినవారు, ఒయ్యనఁ=వరుసగా, వచింపఁ=పలుకఁగా, ఏరాజు=ఏప్రభువు బాగుగఁ=చక్కఁగా. వినుచుఁ=ఆలకించుచు, కనికరమునఁ=దయతో, మొదటఁ=ఆదియందు, రోగార్తజనులను=రోగముతో బాధపడు మనుజులను, ప్రోచుకొఱకుఁ=రక్షించునిమిత్తము=అత్యంతవైభవమునఁ=ఎక్కువవిభవమున, వైద్యులఁ=వైద్యులను, నిల్పుఁ=నిల్పునో, అతనిపుణ్యంబు=ఆరాజుపుణ్యము, బ్రహ్మకునైనఁ=బ్రహ్మదేవునికైనను, కలదే=ఉన్నదా, అనఁగా లేదనుట.

తా. ఈశరీరము పరోపకారార్థము, ధర్మమువృద్ధియగుచున్నది, ధర్మము త్వరగాఁజేయుము, సమస్తజనులు సుఖముగా నుందురుగాకయని వేదములును, పురాణములు

ను, సాధువులును, వేదవేత్తలును పల్కఁగావిని యేరాజు ప్రజారక్షణార్థము వైద్యులఁబ్రోచునో ఆరాజుచేసికొనినపుణ్యము బ్రహ్మదేవునికయిన లేదనుట.

వ. కావున.

సీ. కోరిముప్పదిమూఁడుకోట్లమరులకెల్ల
నాశ్వనేయులువైద్యులైరి మొదల
మునిజనంబులకత్రితనయుమార్కండేయ
కంకాయనాదులుఘటకులైరి
శ్రీరామచంద్రుని చిత్తంబురంజిల్ల
బలసుషేణాదులుబలితులైరి
విక్రమార్కునిరాజ్యవిభవంబుననుభట్టి
శక్తిశాబరులుప్రశస్తులైరి
భోజవిభునాడువైద్యులుభోగులైరి
ఆదివైద్యుఁడుధన్వంత్రియనఁగ వెలసెఁ
గానవైద్యంబురాజసన్మానదంబు
సర్వజనవశ్యమిహపరసాధనంబు.

టీ. కోరి=కోరికొని; ముప్పదిమూఁడుకోట్లు, అమరులకెల్లన్=దేవతలకందఱికిని, మొదలన్=మొట్టమొదట ఆశ్వనేయులు=అశ్వినీదేవతలు- వైద్యులైరి మునిజనంబులకు=మునిసముదాయమునకు, అత్రితనయ=ఆత్రేయుఁడును మార్కండేయ=మార్కండేయుఁడును, కంకాయన=కంకాయనుఁడును, ఆదులు=మొదలయినవారు- ఘటకులైరి=నేర్పరులైరి శ్రీరామచంద్రుని=శ్రీరామమూర్తియొక్క- చిత్తంబు=హృదయము- రంజిల్లన్=ప్రకాశించునట్లు. బల=బలుఁడును సుషేణ=సుషేణుఁడు, ఆదులు=మొదలయినవారు బలితులైరి=ప్రముఖులైరి- విక్రమార్కుని=విక్రమార్క మహారాజుయొక్క- రాజ్యవిభవంబునను=రాజ్యవైభవమందు. భట్టి=భట్టియనువాతఁడు, శక్తిశాబరులు=శక్తియుశాబరియు, ప్రశస్తులైరి=పొగడొందినవారైరి, భోజవిభునాడు=భోజమహారాజుకాలమున, వైద్యులు, భోగులైరి=భోగవంతులైరి, ఆదివైద్యుండు=మొదటివైద్యుడు, ధన్వంత్రియనఁగన్=ధన్వంత్రియనుపేరుతో, వెలసెన్=ప్రకాశించెను, కాన=కాఁబట్టి, వైద్యంబు=వైద్యము, రాజసన్మానదంబు=రాజులచేతనైన గౌరవమును, ఇచ్చునది, సర్వజనవశ్యము=సకలజనులను వశపరచునదియు, ఇహపరసాధనంబు=ఇహలోకపరలోక సాధనమైనది

తా. ముప్పదిమూడుకోట్ల దేవతలకును, అశ్వనీదేవతులును, మునులకు, ఆత్రేయ మార్కండేయ, కంకాయనులనువారును, శ్రీరామునియొద్ద బలసుషేణాదులును, విక్రమార్కునియొద్ద భట్టికవి, శక్తియు, శబరియు, ఇంకను భోజరాజు నొద్దచాలమంది వైద్యులును పేరుపొందియుండిరి. ధన్వంతరియనియాది వైద్యుఁడు ప్రకాశించెను. కాఁబట్టి వైద్యము సకల జనులను వశ్యపరచుకొని, ఇహపర సాధనము గలదియై, రాజసన్మానము నొసంగును.

గీ. ఇంద్రియంబులలోన నయనేంద్రియంబు
తగఁబ్రధానంబుగావునఁదదుపయోగ
వైద్యములుకోరిచేసిన వైద్యజనము
లైహికాముష్మిక సుఖంబులందుటరుదె.

టీ. ఇంద్రియంబులలోన్=పంచేంద్రియములందు, నయనేంద్రియంబు=నేత్రమనునింద్రియము, తగన్=ఒప్పునట్లు, ప్రధానంబు=ముఖ్యమయినది. కావునన్=కాబట్టి, తత్=ఆనేత్రసంబంధమైన, ఉపయోగ=పనికివచ్చు, వైద్యములు=చికిత్సలు, కోరికొన చేసినన్=చేసినయెడల, వైద్యజనములు=వైద్యులు, ఐహికాముష్మిక సుఖంబులు=ఇహపరలోకసౌఖ్యములు, అందుట=పొందుట, అరుదె=ఆశ్చర్యమా ?

తా. అన్నియింద్రియములలోనయనేంద్రియము ముఖ్యమయినది కావున తత్సంబంధమగు చికిత్సలుచేసినవైద్యులు, ఇహ పరలోక సౌఖ్యములను పొందుటకేమివింత.

వ. అదియునుంగాక.

క. మితాదిదైవికంబగు । నేత్రంబులఁబొడమురోగనికరము నడపం
బాత్రములగువైద్యులకామిత్రునిసాలోక్యసుఖము మేలుగగలుగున్

టీ. మిత=మిత్రము (అనఁగా ఏదియొకప్రమాదము) ఆది=మొదలగు, దైవికంబగు=దైవముపుట్టించకలో చేసినవిధమైన నేత్రంబులన్=కనులయందు, పొడము=పుట్టునట్టి, రోగనికరములు=రోగ సముదాయములు, అడపన్=పోగొట్టుటకు, పాత్రములగు=తగినట్టి, వైద్యులకు, ఆమిత్రుని=ప్రసిద్ధుడగు సూర్యుని, సాలోక్య సుఖము, మేలుగన్=చక్కఁగా, కలుగున్=కలుగును.

తా. ఏవిధమైనప్రమాదమువలన, దైవికముగనైనను కనులకుగలిగిన జబ్బులనుబాగుచేయువైద్యుఁడు సూర్యసాలోక్యముంబొందుననుట.

వ. రోగోత్పత్తిలక్షణాభిధానంబులెఱింగించెద.

తా. రోగములుపుట్టుటకు లక్షణములు, వాని పేరులుం జెప్పెదను.

గీ. తల్లిదండ్రులగురువులధరణిసురుల
సురలమానులఁబశుతులనుహరిహరులను



నిందలొనరించుపాపముల్ గ్రందుకొనఁగ
నయనరోగంబులుదయించునరులకండ్రు.

టీ. తల్లిదండ్రులన్, తల్లిదండ్రులను, గురువులన్=గురువులను, ధరణిసురలన్=బ్రాహ్మణులను, సురలన్=దేవతలను, మౌనులన్=మునీశ్వరులను, శ్రుతులన్=వేదములను, హరిహరులను=విష్ణువును శంభువును, నిందలొనరించు=దూషణలుచేయుటవల్లనైన, పాపముల్=పాపములు. గ్రందుకొనఁగన్=చుట్టుకొనగా- నరులకు=మనుజులకు-నయనరోగంబులు=నేత్రజాడ్యములు ఉదయించున్=పుట్టును- అండ్రు=అనెదరు.

తా. తల్లిదండ్రులను, గురువులను, బ్రాహ్మణులను, దేవతలను, వేదములను, మునీశ్వరులను, హరిహరులను నిందించినపాపమే నేత్రరోగములుగా నరులకుఁ బుట్టుననెదరు.

శా. నానాదేశవిహారముల్సలుప నానానీరపానంబులన్
నానాశీతలవస్తుసేవనలు నానాపథ్యభంగంబులన్
నానాభ్యంజనదుర్భరంబులననూనంబైన దుఃఖంబులన్
గానం దొంబదియాఱు నేత్రరుజముల్ గల్పించుమర్త్యాళికిన్.

టీ. నానాదేశవిహారముల్ సలుపన్=అనేకదేశములు తిరుగుటను, నానానీరపానంబులన్=అనేకజలములు త్రాగుటను, నానా=ఎక్కువయిన, శీతల=చలువదైన, వస్తు=వస్తువులయొక్క, సేవనలు=తినుటను, నానా=సమస్తమైన, పథ్యభంగంబులన్=అపథ్యదోషములను- నానా=పలువిధములైన- అభ్యంజన=స్నానములయొక్క, దుర్భరంబులను=భరించలేకపోవుటను- అనూనంబైన=ఎడతెగని- దుఃఖంబులన్=విచారములను- కానన్=పొందఁగా- తొంబదియాఱు, నేత్రరుజముల్=నేత్రరోగములు- మర్త్యాళికిన్=జనసమూహమునకు- కల్పించు=పుట్టించును.

తా. పలుదేశములు తిరుగుట, అన్నిజలములు త్రాగుట, అన్నిచలువవస్తువులుసేవించుట, అపథ్యముచేయుట పలువిధములుగా స్నానముచేయుట ఎక్కువగా నేడ్చుట మొదలయినవానిచే మనుజులకు తొంబదియాఱు నేత్రరోగములు పుట్టుచున్నవి.

వ. అవియేవియనిన.

గీ. అనిల, కఫ, పిత్త, రక్తంబులనెడునాల్గు
మించుగుణములనవి వికారించెనేని
కన్నుగవలనురోగముల్ గలుగుమిగుల
నవియభిష్యందనామధేయములుకృష్ణ.

టీ. అనిల=వాయువు, కఫ=శ్లేష్మము, పిత్త=పైత్యము, రక్తంబులు, అనెడు=అనునట్టి, నాల్గున్=నాలుగును, మించుగుణములన్=తమసైసర్గికగుణములనుండి, అవి=ఆనాల్గును, వికారించెనేని=వికారమునుపొందినయెడల, కన్నుగవలను=నేత్రద్వయముల

ను, రోగముల్=జబ్బులు, మిగులన్=మిక్కిలి, కలుగున్=పుట్టును, అవి=అవికారించి ననాలుగును, కృష్ణ=ఓకృష్ణమూర్తీ, అభిష్యంద నామధేయములు=అభిష్యందమను పేరు గలవి.

తా. ఓకృష్ణమూర్తీ అనిల, కఫ, పిత్త రక్తములనునట్టి నాలుగునాడులును తమ స్వభావమునుమాని మరియొకరీతిని మారినయెడల కనులయందు మిక్కిలి రోగములుగలుగును. అవియేయభిష్యందములని పేరులుగలవి.

వ. దేవా! మఱియు రక్తశ్వేతకృష్ణపీత వర్ణంబులైనకాచరోగ చతుష్టయంబును రక్తపటలంబును, శ్వేతపటలంబును కృష్ణపటలంబును పీతపటలంబును దివాంధంబును నిశాంధంబును తిమిరంబును నేత్రపుష్పంబును దుర్మాంసంబునుజలస్రావంబును అతిస్రావంబును నేత్రదాహంబును నేత్రాఘాతంబును నేత్రగంధియు నేత్రలూతికయు నేత్రశోథయు నేత్రశూలయు రక్తపిల్లంబును కృష్ణపిల్లంబును శుక్లపిల్లంబును పీతపిల్లంబును నేత్రబుద్బుదంబును నేత్రకాయంబును, రక్తగ్రంధియు, చత్వారియు నేత్రసూక్ష్మచలనంబును, నేత్రాచలనంబును, నేత్రాజరంబును, నేత్రబంధంబును, నేత్రభగ్నంబును, నేత్రభ్రమణంబును, నేత్రమాలిన్యంబును, నేత్రాశనియు, ద్వినేత్రంబును, నేత్రనిశ్చితంబును, నేత్రఖండంబును, అధోదృష్టియు, ఊర్ధ్వదృష్టియు, నేత్రాగ్నియు, నేత్రపాతంబును, నేత్రపూయంబును నేత్రకుష్ఠువును నేత్రార్ధదృష్టియు నేత్రోన్మీలనంబును నేత్రనిమీలనంబును మందదృష్టియు నేత్రమలంబును నేత్రగర్తనంబును కృష్ణమండలంబును శుక్లపుష్పంబును రక్తపుష్పంబును పీతపుష్పంబును అగ్నిగ్రంధియును నేత్రాతిమలంబును నేత్రవల్మీకంబును పక్షఘాతంబును పక్షశూలయు పక్షశోభయు పక్షదాహంబును పక్షపక్ష్మంబును పక్షజాతంబును పక్షచలనంబును పక్షాతిచలనంబును పద్మార్బుదంబును పద్మకాయంబును పద్మఖండంబును నేత్రపార్శ్వయు జలస్రావయు నేత్రపార్శ్వశూలయు నేత్రపార్శ్వశోభయు నేత్రపార్శ్వఖండూతియును నేత్రపార్శ్వచాంచల్యంబును నేత్రపార్శ్వరక్తంబును నేత్రార్శరణంబును నేత్రరోధంబును నేత్రవిస్ఫోటకంబును నేత్రవిలోకనంబును నేత్రఫల్లంబును నేత్రపుష్పంబును నేత్రగాఢాగ్నియు దుఃఖనేత్రంబును దుర్మదాంధంబును పక్షదుర్మాంసంబును నేత్రపిపీలికంబును నేత్రాతిరోమంబును నేత్రాతిరోమనాశంబును ఆదిగాంగల తొంబది యారు నేత్రరోగంబులం దభిష్యందరోగంబుల తెఱంగెఱింగించెద.

సీ. నేత్రంబులెఱ్ఱనై నీరుచేపోటుచే
నలయింపం వాయ్వభిష్యందమనిరి
కల్గికన్నులమంటగలిగి మెఱ్మెరలాడ
పైత్యాభిష్యందమాఖ్యారమనిరి
నయనంబులను పుసుల్ నసి మెర్లుగల్గిన
శ్లేష్మాభిష్యంధమనా చేష్టలనిరి

దుర్మాంసములుబుట్టిదుర్భరవ్యధసేయ
రక్తజాభిష్యందయుక్తమనిరి

గీ. కానయిటువంటినయనరోగములవిధము
లరసియాలస్యముగ కాలమరుగనీక
తగినసాధనములుముఖ్యముగనుజేసి
బాగుసేయంగఁదగుభోగిభోగశయన.

టీ. నేత్రంబులు=కన్నులు, ఎఱ్ఱనై=ఎరుపుగలవై, నీరుచేన్=నీటిచేత, పోటు చేన్=పోటుచేతను, అలయింపన్=బాధపెట్టగా, వాయ్వభిష్యందము=వాతమునఁగలిగిన అభిష్యందరోగము, అనిరి=చెప్పిరి,కలిగి=కన్నులుకలకబడి,కన్నులన్ = నేత్రములయందు, మంటగలిగి=మంటతోఁగూడుకొని, మెర్మెరలాడన్ =గరగరలాడినయెడల పైత్యాభిష్యందము=పైత్యమువలనఁబుట్టిన అభిష్యందరోగము, జౌ=అగునట్టి, భూరిమనిరి=బరువనిచెప్పిరి. నయనంబులను=నేత్రములయందు, పుసుల్=పుసులును, నసిమప్లు=దురదలు, కలిగినన్=పుట్టినయెడల, శ్లేష్మాభిష్యందము= శ్లేష్మమువలనపుట్టిన అభిష్యందరోగము, జౌ=అగునట్టి, చేష్టలనిరి=గుణములనిచెప్పిరి- దుర్మాంసములు=కుదుపగట్టినమాంసము- పుట్టి= కలిగి, దుర్భర = భరింప శక్యము గాని- వ్యధ సేయన్= బాధ పెట్టగా, రక్తజా భిష్యా దయుక్తము = రక్తము వలన బుట్టిన అభిష్యంద రోగ ముతోఁగూడి నది- అనిరి = చెప్పిరి, కానన్ = కాఁబట్టి, ఇటువంటి = ఈ విధమయిన, నయనరోగముల విధములు=నేత్రజాడ్యముల యొక్క గుణములు, అరసి=ఆలోచించి, ఆలస్యముగన్=ఆలస్యముచేత కాలము, అరుగనీక=పోనీయక, తగిన సాధనములు=తగినట్టి చికిత్సలు, ముఖ్యముగనుజేసి=తప్పకజరిపి, భోగి=సర్పముయొక్క భోగ=పడగయే, శయన=పడకగాఁ గలిగిన ఓవిష్ణుమూర్తీ! బాగుసేయఁగదగున్=బాగు సేయఁ దగును.

తా. కన్నులు ఎరుపెక్కి పోటుగలిగి నీరు గారుచుండిన వాయ్వభిష్యంద మనియు, కనులు ఇరుకునఁబడి మెరమెర లాడుచుండినయెడల పైత్యాభిష్యందమనియు, కనులు పుసికట్టి దురదలు గలిగినయెడల శ్లేష్మాభిష్యంద గుణములనియు, కనులయందు కొయ్యగండలు పెరిగి బాధపెట్టినయెడల రక్తాభిష్యందమనియు, చెప్పెదరు. కాబట్టి యిట్టినేత్రరోగములను గుర్తించి రోగము ముదురక మునుపే తగిన చికిత్స లొనర్చి బాగు చేయ వలెను.

వ. తత్సాధనభేదంబులు లక్షణ లక్ష్యంబుల నెఱింగించెద. సావధానంబుగ నాకర్ణింపుము.

మ. తనపూర్వంబునఁ జేయుదోషచయముల్ దార్కొన్న రోగంబులై
తనరుం గావున నాదిపూరుషుఁడు తా ధన్వంత్రియై పుట్టి యీ
జనులం బ్రోవఁ దలంచి యాధిజనులం జర్చించి తచ్ఛాంతికై
కనిపెట్టెన్ సకలౌషధంబులు దయం గల్పించి శాస్త్రోన్నతిన్.

టీ. తన=తనయొక్క-పూర్వంబున సేయు=పూర్వజన్మమునఁ జేసికొనిన-దోషచయముల్=పాపసమూహములు- దార్కొనన్=చుట్టుకొనఁగా, రోగంబులై=ఆపాపములే వ్యాధులై-తనరున్=ఒప్పును. (అనగా సంభవించునంట) కావునన్=కాబట్టి-ఆదిపూరుషుఁడు=భగవంతుఁడు- తాన్=తాను- ధన్వంత్రియై=ధన్వంత్రియను వైద్యశ్రేష్ఠుఁడై- పుట్టి=జన్మించి- ఈజనులన్=ఈప్రపంచమందలి మనుష్యులను- ప్రోవన్=ప్రోచుటకు- తలంచి=ఎంచి- ఆధిజనులన్=మనోవ్యధగలిగిన మనుష్యులను- చర్చించి=విచారణచేసి- తత్=ఆరోగమూలమైన మనోవ్యధయొక్క- శాంతికై=నెమ్మదించునిమిత్తము. శాస్త్రోన్నతిన్=శాస్త్రప్రకారము- దయన్=ప్రేమతో- కల్పించి=ఊహించి-సకలౌషధంబులున్=అన్నివిధములగు మందులును- కనిపెట్టెన్=తెలుసుకొనెను.

తా. పూర్వజన్మమునఁ జేసికొనిన పాపకర్మలే రోగములై జనులను బాధించుచుండ భగవంతుండు ధన్వంత్రియై మనుష్యులబాధలు నివారించుటకు, పుట్టి శాస్త్రోక్తమగు నౌషధములను ఊహించి కనిపెట్టెను.

వ. అవి యెయ్యవి యనిన.

గీ. కట్లుపట్లుఁ బథ్యముల్ కాటుకలును
నస్యములుతైలములు భేదనములు నౌష
ధములు నద్దములనఁ దొమ్మిదమరు నేత్ర
రోగసాధనలగు భోగిభోగశయన.

టీ. కట్లు=కట్లును- పట్లును=పట్లును- పథ్యముల్=పథ్యములును- కాటుకలును, నస్యముల్ = పొడుములును- తైలముల్=చమురులును- భేదనములున్ = పొరలు దీయుటయును- ఔషధములున్ = మందులును- అద్దములున్=సులోచనములు మొదలగునవియు - అనన్ = అనఁగా- భోగిభోగశయన=పాముపడగమీఁద పవ్వళించు విష్ణుమూర్తీ- తొమ్మిది అమరు=ఒప్పునట్టి నేత్రరోగసాధనలు=కండ్లజబ్బులు బోఁగొట్టు సాధనములు- అగున్=అవును.

తా. కట్లు, పట్లు, పథ్యములు, కాటుకలు, నస్యములు, తైలములు, భేదనములు, ఔషధములు, అద్దములు అనుతొమ్మిదియును నేత్రరోగములను బోఁగొట్టు సాధనములు.

వ. అందుకట్లతెఱంగెఱింగించెద.

## కట్లనిర్ణయము.

క. అనువెఱిఁగి తమలపాకులు
నొనరఁగ వేర్వేఱఁగానుఁగుమ్మెత్తాకుల్
కనులపయిఁగట్టినంతనె
చనెడు నభిష్యందరోగచయము రమేశా.

టీ. రమేశా = ఓవిష్ణుమూర్తీ- అనువెఱిఁగి = విలు తెలిసికొని- తమలపాకులు- కానుఁగు = గానుగచెట్టుయొక్కయు- ఉమ్మెత్త = ఉమ్మెత్తయొక్కయు- ఆకుల్ = ఆకులు వేర్వేఱన్ = వేరువేరుగా- ఒనరఁగన్ = ఒప్పునట్లు- కనులపయిన్ = నేత్రములమీద- కట్టినంతనె = కట్టినతోడనే అభిష్యందరోగచయము = అభిష్యందమను పేరుగల రోగసముదాయము- చనెడున్ = పోవును.

తా. తమలపాకులును, కానుగాకులును, (గానుగ) ఉమ్మెత్తాకులును, వేర్వేఱుగా కనులకు వేసినట్టియెడల అభిష్యందరోగములు పోవును.

వ. మఱియును.

చ. తులసియుఁబొన్నగంటిసలతుమ్మయుసన్నకసింతమారెడా
కులుకడువేఱువేఱుగను గోఘృతముంగొని వేచి కండ్లనిం
పలరఁగఁగట్టినన్మఱియు నన్నము నేయియుఁగట్ట రెప్పనొ
ప్పులుపుసినీరు మెర్మెరలు పోటులు మంటలు మానుఁ గేశవా.

టీ. కేశవా = ఓవిష్ణుమూర్తీ, తులసియున్ = తులసియును, పొన్నగంటి = పొన్నగంటియును, నలతుమ్మయు = నల్లతుమ్మయును, సన్నకసింత = సన్నకసింతయు, మారెడు = మారేడును, ఆకులు = వీటియాకులు, వేఱువేఱుగను = విడివిడిగా, గోఘృతముంగొని = ఆవునేయితీసికొని, వేచి = వేపి, కండ్లన్ = కనులకు, ఇంపలరగగట్టినన్ = చక్కఁగా కట్టినయెడలను, మఱియు = ఇంతేకాకుండ, అన్నము, నేయియుఁగట్టన్ = అన్నము నేయి యునుగట్టినయెడలను, రెప్పనొప్పులు = రెప్పలయందుఁబుట్టిననొప్పులును, పుసి = పుసులు గారుటయు, నీరు = నీరుగారుటయు, మెర్మెరలు = మెర మెరలాడుటయు, పోటులు = పోట్లుపొడుచుటయు, మంటలున్ = మంటలు గానుండుటయును, మానున్ = పోవును.

తా. రెప్పలయందునొప్పులున్నను కనులుపుసికట్టుచుండినను నీరుగారుచుండినను మెరమెరలాడుచుండినను పోట్లు మంటలుగలిగియున్నను తులసియాకు. పొన్నగంటియాకు నల్లతుమ్మాకు సన్నకసింతాకు మారెడాకులును వేఱువేఱుగా ఆవునేతితో వేచి కట్టినయెడల మానును.

వ. పట్లవిధంబెఱింగించెద.




## పట్టునిర్ణయము.

గీ. కరకకాయశిలాజిత్తుకావిఱాయి
సైంధవముమ్రానిపసపునుసలిలములను
దీసికన్నులపైఁబట్టువేసి రేని
వినుమభిష్యందములుమానుఁ బవనశయన.

టీ. కరకకాయ=కరకకాయయును- శిలాజిత్తు=శిలాజిత్తును- కావిఱాయి=ఎఱుపురంగుగల సుద్దరాయియు- సైంధవము=ఇందుప్పును (అనగా సింధువునఁబుట్టిన లవణము) మ్రానిపసపు=మ్రానిపసపును- (దారుహరిద్రము) సలిలములను=నీటితో- తీసి=నూరితీసి, కన్నులపైన్=నేత్రములమీఁద, పట్టువేసి రేని=పట్టువేసినయెడల, పవనశయన=పాఁపపానుపుపై పవ్వళించిన యోవిష్ణుమూర్తీ- అభిష్యందములు=అభిష్యందనామములుగల కంటిజబ్బులు, మాను=నివర్తించును- (పోవును) వినుము=ఆలకింపుము.

తా. కరకకాయయు, శిలాజిత్తును, ఎఱ్ఱరంగు సుద్దరాయియు, సైంధవలవణమును, మ్రానిపసపును, నీటితో నూరి కనులకుఁ బట్టించిన యెడల నభిష్యంద రోగములు మానును.

క. విను మ్రానిపసపు గైరిక
మును ముస్తెలు మేకపాలముదమొప్పంగాఁ
గనులపయి పట్టువేసిన
మునుకొని సకలాక్షిరోగములు మానుహరీ.

టీ. హరీ=విష్ణుమూర్తీ- వినుము=ఆలకింపుము, మ్రానిపసపున్=మ్రానిపసపును- గైరికమును=పర్వతధాతువిశేషమగు గైరికమును, ముస్తెలు=తుంగముస్తెలును, మేకపాలన్=మేకపాలతో, ముదమొప్పంగాన్=సంతోషమతిశయించునట్లు, కనులపైన్=నేత్రములమీఁద, పట్టువేసినన్=పట్టువేసినయెడల, మునుకొని=మొదలుపెట్టి సకల=సమస్తవిధములగు, అక్షిరోగములు=కంటిజబ్బులు మానున్=పోవును.

తా. మ్రానిపసపును, గైరికమును, తుంగముస్తెలు, మేకపాలతో నూరి కనులకుఁ బట్టించినయెడల సమస్తవిధములగు కంటిజబ్బులును మానును.

ఆ. నూఁడయొత్తునల్లమందొకచిన్నంబు
పటికభంగివిత్తులటులవంగ
ములునుజన్నుఁబాలముఖ్యంబుగావంచ
పట్టువేయ నేత్రబాధలణఁగు.

టీ. నల్లమందు మాడయెత్తును, పటిక ఒకచిన్నమును, ఘంగివిత్తులు=గంజాయిగింజలు, అటు=పయినిచెప్పిన చిన్నమును, లవంగములు, ఒక్కచిన్నమెత్తును, చన్నుబాలక్=చనుబాలతో, ముఖ్యంబుగాక్ = ప్రశస్తముగా, వండి=పాకముచేసి, పట్టువేయక్=పట్టువేసిన యెడల, నేత్రబాధలు=కంటిబాధలు, అణంగుక్=అడంగిపోవును.

తా. నల్లమందు మాడయెత్తును. పటిక, గంజాయివిత్తులు, లవంగములు ఒక్కొకచిన్నముచొప్పున చనుబాలతోవండి పట్టువేసినయెడల నేత్రబాధలుపోవును.

వ. పథ్యాలక్షణంబెఱింగించెద.

## పథ్యనిర్ణయము.

చ. కలగరచేతరాసియునుగజ్జెరుచిత్రియుఁబొన్నగంటిబా
యిలకొయతోటకాడలుడికించినకూరయు చింతపొట్టునుం
బలుచనియావుమజ్జిగయుఁబచ్చపెసల్వరివంటకంబునన్
బలిమిగనేత్రరోగములపథ్యములౌనురమామనోహరా.

టీ. రమామనోహరా=ఓయిలక్ష్మీమనోహరుఁడా, కలగర=గుంటగలగరయు, చేతరాసి=చేదరాసికూరయు, గజ్జెరు=గజ్జెరును, చిత్రియున్=చిత్రికూరయు, పొన్నగంటి=పొన్నగంటికూరయును, బాయిల=బాయిలాకును, కొయతోటకాడలు=కొయ్యతోటకూరకాడలును, ఉడికించినకూరయు=పచనముజేసినకూరయు, చింతపొట్టునున్=చింతాకుపొట్టును, పలుచనియావుమజ్జిగయున్=పల్చగానుండుఆవుచల్లయును, పచ్చపెసల్=పచ్చపెసలును. వరివంటకంబునన్, బలిమిగన్=ఎక్కువగా, నేత్రరోగముల=కనులజబ్బులయొక్క, పథ్యములౌను=పథ్యవస్తువులగును.

తా. గుంటకలగరయు, చేదరాసికూరయు, గజ్జెరు, చిత్రికూర, పొన్నగంటికూర, బాయిలాకు, కొయ్యతోటకూర, చింతపొట్టు మొదలయిన యుడికించినకూరలును, పలుచని ఆవుమజ్జిగయును పథ్యపదార్థములు.

వ. అపథ్యాలక్షణంబెఱింగించెద.

## అపథ్యాలక్షణము.

ఉ. ఎండినకూరలుంబెరుగునింగువమాంసముకల్లునువ్వులున్
మెండుగసీధ్రుత్రాగుటయుమిన్ములబూరెలునుప్పుతమ్ములం
బెండయుఁగోపముంబయనమేగుటస్నానముస్త్రీసుఖంబుచే
నుండుటనేత్రరోగులకునొప్పదుశ్రీరమణీమనోహరా.

టీ. ఎండినకూరలున్ = ఎండిపోయినకూరలును- పెరుగున్=పెరుగును- ఇంగువ=ఇంగువయు- మాంసము, కల్లు, నువ్వులున్=నువ్వులును- మెండుగన్=విస్తారముగా,

నీళ్ళుత్రాగుటయు, మినప్పులబూరెలున్=మినపబూరెలును- ఉప్పు=ఉప్పును- తమ్ములంబు=తాంబూలంబును- ఎండయున్=ఎండఁబడుటయును- కోపమున్= కోపించుటయును- పయనమేగుట=ప్రయాణముచేయుట- స్నానము=స్నానముచేయుట- స్త్రీసుఖంబుచేన్=స్త్రీతోగమించుటచేత- ఉండుట, శ్రీరమణీమనోహరా=లక్ష్మీమనోహరుఁడగు విష్ణుమూర్తీ=, నేత్రరోగులకు=కంటిజబ్బులుగలవారికి- ఒప్పదు=తగదు.

తా. కంటిజబ్బులుగలవారు ఎండినకూరలును, పెరుగు, ఇంగువ, మాంసము, కల్లు, నువ్వులు, విస్తారముగాదాహముత్రాగుట, మినపబూరెలుతినుట, ఉప్పు, తాంబూలమువేయుట, ఎండబడుట, కోపముజెందుట, ప్రయాణముచేయుట, స్నానముచేయుట, రమించుటయును తగదు.

వ. కాటుకలు సేయుతెరంగు లెఱింగించెద.

1. లాక్షాంజనము.

ఆ. లక్కమ్రానిపసపురక్తమణిశ్శిల
వావిళంగములునుకావిరాయి
చెలులపాలబాలకులకుఁగన్నులవేయ
గూనలంటుకలకమానుగృష్ణ.

టీ. లక్క=లక్కయును, మ్రానిపసపు=మ్రానిపసపును, రక్తమణిశ్శిల=ఎఱ్ఱనిమణిశిలయును, వావిళంగములును=వాయువిళంగములును, కావిరాయి=జేగురుసుద్దరాయియు, చెలులపాలన్=స్త్రీలపాలతో (చనుబాలు) బాలకులకు=పిల్లలకు, కన్నులవేయన్=కనులకువేసినయెడల, కూనలు=కనులలోకూనలువేయుటయు, అంటు=కనులంటుకొనుటయు, కలక=కంటికలకయును, కృష్ణా=మానును, పోవును.

తా. బాలులకు కనులలోకూనలుబయలుదేరినను, అంటుకొనుచుండినను, కలిగినను, లక్క, మ్రానిపసపు, ఎరుపురంగుగల మణిశిల, వాయువిళంగములు, ఎఱ్ఱసుద్దరాయి చనుబాలతో వేసినయెడల కుదురును.

2 అక్షాంజనము.

ఆ. మైలుతుత్తమునతిమధురంబునుసిరిక
పప్పుతాడికాయపలుకుమిరియ
ములునుసరిగతోయములనూరియుడనేత్ర
పటలతిమిరములనుబాపుకృష్ణ.

టీ. కృష్ణా=కృష్ణమూర్తి, మైలుతుత్తమున్=మయూరతుత్తమును, అతిమధురంబును=యష్టిమధుకంబును, ఉసిరికపప్పు=ఉసిరికకాయపప్పును తాడికాయపలుకున్=తాడికాయపలుకులును, మిరియములును, సరిగన్=సమానభాగములుగా, తోయములనూరి=

గాన్=తప్పక- శుక్లపటలమ్ములన్నియున్= శుక్లనష్టముచేఁ గలిగిన నేత్రరోగము లన్నియు- సుడిసిపోవుఁ= నశించిపోవును. పొరలున్= కంటిపొరలును- తిమిరంబులు=చీకట్లుగానుండుట- అవరులు= కంటికలఁకలును- పోలియున్= మాయమగును.

తా. మంచిగంధము, మణిసిల, సైంధవలవణము, అరదళము, శంఖము, యష్టిమధుము, మిరియాలు, పటికి, సమభాగంబులుచేసి నీటితోనూరి కణికలుచేసి నీడనారఁబెట్టిక చనుబాలతోనైనను, మునగపువ్వురసముతోనైనను, అరగదీసి కనులకుఁ బెట్టినయెడల శుక్లపటలములను జబ్బులును, పొరలు, చీకట్లుగ్రమ్ముట, కలఁకలును మానును.

## 4. శస్త్రివల్లభాంజనము.

ఉ. సంకునుమున్గవిత్తులును సైంధవముందగఁ గోడిగ్రుడ్డుపై
పెంకుసముద్రఫేనమొగి ప్రేమజలంబుల నూరికన్నులం
గొంకకమున్గపూరసముఁ గూరిచివేసిన శస్త్రివల్లభం
బంకెకురానిశుక్లపటలాదులుమానును గోపవల్లభా.

టీ. సంకును= శంఖమును- మున్గవిత్తులును= మునగగింజలును- సైంధవమున్= సైంధవలవణమును- కోడిగ్రుడ్డుపైపెంకున్=కోడిగ్రుడ్డుమీఁదిపెంకును- సముద్రఫేనము= సముద్రపునురుగయును- తగన్= ఒప్పునట్లు- బగిన్= వరుసగా- ప్రేమన్= శ్రద్ధతో- జలంబులనూరి= నీటితోనూరి- మున్గపూరసముఁగూరిచి= మునగపువ్వురసముంజేర్చి- కొంకక= సంశయించక- శస్త్రివల్లభంబు= శస్త్రివల్లభమను పేరుగల యంజనము- కన్నులన్= నేత్రములకు- వేసినన్= పట్టించినయెడల గోపవల్లభా= కృష్ణమూర్తీ- అంకెకురాని= స్వాధీనముకాని, శుక్లపటలాదులు= శుక్లపటలము-రక్తపటలము మొదలగుజబ్బులు- మానును= పోవును.

తా. శంఖమును, మునగగింజలు, సైంధవలవణము, కోడిగ్రుడ్డుమీఁది పెంకును,సముద్రఫేనమును, నీటితోనూరి మునగపువ్వురసముం గలిపి కనులకుఁ బట్టించినయెడల శుక్లపటలము మొదలగు అసాధ్యపు నేత్రరోగములు మానును.

## 5 అమలకాంజనము,

ఉ. ఆమలకంబుమిర్యములు నారయఁగానుగవిత్తులొప్పఁగా
సోమమునందనందు గణసంఖ్యల గుంటకరాకు నీటితో
ప్రేమనునూరికన్నులనుబెట్టిననామలకాంజనంబుచేఁ
గామెకలక్షిరోగములుకాచలుతీటలుమానుఁగేశవా

టీ. కేశవా=ఓవిష్ణుమూర్తి, ఆమలకంబు=ఉసిరికయును, మిర్యములున్=మిరియములును, కానుగవిత్తులు=కానుగగింజలును, అరయన్=విచారించగా, ఒప్పుగాన్=చక్కగా, సోమమునందన్=ఉపాయముతో, అందున్=పయినఁజెప్పినవస్తువులయందు,

గణ=పయినఁజెప్పినవస్తు సమూహముయొక్క, సంఖ్యలన్=ఎన్నికతో (అనఁగా ఉసిరిక, మిరియములు, కానుగవిత్తులు, వీనితోసరిగా) గుంటకరాకునీటితో=గుంటకలగరాకురసముతో, ప్రేమను=శ్రద్ధతో, నూరి=అరుగదీసి, కన్నులను బెట్టినన్=కనులయందుంచినచో ఆమలకాంజనంబుచే=ఆమలకాంజనమువలన, కామెరలు=కామెరలనుజబ్బులును, అక్షిరోగములు=తక్కిననేత్రరోగములును, కాచలు=కాచరోగములును, తీటలు=కంటిదురదలును, మానును=పోవును.

తా. ఉసిరికయు, మిరియములును, కానుగగింజలును, నొకవంతును. వీనియన్నిటి యెత్తు గుంటకలగరాకురసముతో నూరి కనులకుఁ బెట్టినయెడల, కామెరలు, కాచలు తీటలుమొదలయిన కంటిజబ్బులు పోవును.

## 6. శంఖాంజనము.

ఉ. పాలిడిసైంధవమ్ము నిరుపాలుమిరెంబులునాల్గుపాళ్ళుగాఁ
బోలఁగరక్తమణ్శిలయుఁబొల్పుగనెన్మిదిపాళ్ళుశంఖమున్
మేలగుమేకపాలనవిమెత్తగనూరియుఁగన్నులందిడన్
దూలలు, పూలు, కాయలనుదుర్గుణముల్ హరియించుమాధవా.

టీ మాధవా=విష్ణుమూర్తి, సైంధవమ్ము=సైంధవలవణము, పాలిడి=ఒకపాలుంచి మిరెంబులు=మిరియములు, ఇరుపాలు= రెండుపాళ్లును, రక్తమణ్శిలయున్=రక్తమణిశిలయును, నాలుగుపాళ్ళుగాన్=నాలుగుపాళ్లుగాను, పోలఁగన్= ఏర్పాటుగా. పొల్పుగన్=చక్కగా, ఎన్మిదిపాళ్లు=ఎనిమిదిభాగములు, శంఖమున్=శంఖమును, మేఁగు=శ్రేష్ఠమయిన, మేకపాలన్=మేకపాలచేత, అవి=పయినజెప్పినవస్తువులు, మెత్తగన్=మెత్తగ, నూరియున్=కలియనూరియు, కన్నులందిడన్=నేత్రములయందుంచినయెడల, దూలలు=దురదలును- పూలు=కన్నులలోని పువ్వులును, కాయలు=కంటికాయలు. అను=అనునట్టి, దుర్గుణముల్=చెడుజబ్బుగుణములు, హరియించున్=నశించును.

తా. కన్నులుదురదగలిగియున్నను, పువ్వులువేసినను, కాయలుకాచినను, సైంధవలవణ మొకపాలును, మిరియములు రెండుపాళ్లును, నాలుగుపాళ్లుమణిసిలయు, ఎనిమిదిపాళ్లు శంఖమును, మేక పాలతోనూరి కన్నుల యందిడిన పయినచెప్పిన దుర్గుణములు హరించును.

## 7. అభయాంజనము

ఉ. నేతలవంగముల్పటికనిప్పులమీదఁదనునాముదంబునన్
బ్రీతిహరీతకిన్ వెలయఁ జేల్చిసమంబుగనావువెన్నతో
ధాతపుకంచుపళ్ళెమునఁదామ్రమునం దెగనూరివేయదు
రాతపునేత్రరోగకులజాలముమానునురుక్మిణీశ్వరా.

టీ. రుక్మిణీశ్వరా=రుక్మిణీ దేవికిం బ్రభువగునోకృష్ణమూర్తీ, నేతన్=నేతియందు లవంగముల్=లవంగములును, నిప్పులమీదన్=నిప్పులపైని, పటిక=పటికయు, అముదంబునన్=ఆముదములో, ప్రీతిన్=శ్రద్ధతో, హరీతకిన్=కరకకాయలను, వెలయన్=ఒప్పునట్లు, పేల్చి=వేయించి, సమంబుగన్=సమభాగములుగా, ఆవువెన్నతోన్=ఆవువెన్నతోడ, ఘౌతపుకంచుపళ్లెమునన్=తెల్లనయిన కంచుపళ్లెమునందు, తామ్రమునన్=రాగిచెంబుతో, తెగనూరివేయన్=మిక్కిలి మెత్తగనూరి కనులకుం బట్టించఁగా, దుర్జాతపు=దుష్టసంభవములయిన, నేత్రరోగ=కంటిజబ్బులయొక్క, కుల=జాతులయొక్క, జాలము=సమూహము, మానును=నెమ్మదింమును.

తా. నేతియందు లవంగములును, నిప్పులమీద పటికయును, ఆముదమున కరకకాయ పేచ్చులును, సమభాగములుగా వేయించి, ఆవు వెన్నతో కంచుపళ్లెమునరాగిచెంబుతో నూరి కనులకు పట్టించిన నేత్రరోగంబులన్నియును మానును.

8. శశిప్రభాంజనము.

చ. ఎనుబదినువ్వుపువ్వులును నేబదియేర్పడ జాజిపువ్వులున్
న్వినుపదియారు మిర్యములు వేగమెపిప్పలి కొమ్ములారునున్
ఘనముగనూరికంక్లనిడఁగాఁ దిమిరంబులు వర్తిరోగముల్
జను శశిప్రభంబిది నిజంబుగ జాంబవతీమనోహరా.

టీ. జాంబవతీమనోహరా=జాంబవతీదేవి మనస్సును హరించిన కృష్ణమూర్తీ, వేగమే=త్వరితో, విను=ఆలకింపుము, ఎనుబదినువ్వుపువ్వులును. ఏర్పడన్=ఏర్పాటుగా, ఏబది జాజి పువ్వులున్ = జాజి పువ్వులును- పదియారు మిర్యములు= పదునారు మిరియపుగింజలును. పిప్పలకొమ్ములు=పిప్పళ్ళు- ఆరునున్=ఆరును- ఘనముగన్=ఎక్కువగా- (అనఁగా మెత్తగా) నూరి=మర్దించి- కంక్లనిడఁగాన్=కనులకుం బట్టించిన యెడల- తిమిరంబులు=కం చీకట్లు గ్రమ్మట- వర్తిరోగముల్= కంటిపొరలలోవేయు జబ్బులు (అనఁగా కనులలో ఏ పొరలలో భాగమునబుట్టు జబ్బులు) నిజంబుగన్=సత్యముగా- చనును=పోవును. ఇది=ఈయంజనము- శశిప్రభంబు=శశిప్రభయను పేరుగలది.

తా. 80 నువ్వు పువ్వులును, 50 జాజిపువ్వులు, 16 మిరియపుగింజలు, 6 పిప్పళ్ళును కలిపి మెత్తగానూరి కనులకుం బట్టించినయెడల కనులు చీకట్లు గ్రమ్మట కంటి పొరలలో బుట్టుజబ్బులును హరించును.

9. చంద్రప్రభావత్యంజనము.

సీ. మానిని తలపెంకు మణిశిలచిల్లగిం
జలుకోడిగ్రుడ్లపెంకులు నువసయు

మున్నీటినురుగునాముదపుపల్కులుమంచి
పిప్పళ్ళుసమభాగమొప్పఁగూర్చి
లలితమౌమాదీఫలపునిమ్మరసములఁ
గలయమర్దనఁజేసికడుఁదీసి
తగినకోపులుచేసితడియార్చియవిదాచి
యనుపానములతోడనదనుకొలఁది

గీ. ఇట్టిచంద్రప్రభావతినెనసికన్ను
గవఁయుంచిడఁబువ్వులునవలుఁబొరలుఁ
గాయలునుమానుదానవఘనసమీర
శ్రితజనాధారరుక్మిణీచిత్తచోర.

టీ. దానవ=రాక్షసులనెడి, ఘన=మేఘములకు- సమీర=వాయువు వంటివాఁడా- శ్రితజన=ఆశ్రితజనులకు, ఆధార=ఆధారమయినవాఁడా- రుక్మిణీ=రుక్మిణీదేవియొక్క- చిత్త=మనస్సును- చోర=హరించిన కృష్ణమూర్తీ- మానిని తల పెంకు=స్త్రీయొక్క తలపెంకును- మణిశిల=మణిసిలయు- చిల్లగి జలు=ఇందుగగింజలును- [కతకము] కోడిగ్రుడ్లపెంకులును, వసయున్=వసకొమ్మను- మున్నీటినురుగున్=సముద్ర ఫేనమును- ఆముదపుపల్కులు=ఆముదపుపప్పును- మంచి=ప్రశస్తమయిన- పిప్పళ్ళు=పిప్పళ్ళను- సమభాగము=సమానపుపాళ్ళు- ఒప్పన్=తగునట్లు- కూర్చి=చేర్చి- లలితమౌ=ఒప్పునట్టి- మాదీఫలపు=మాదీఫలముయొక్కయు- నిమ్మ=నిమ్మపండ్లయొక్కయు- రసములన్=రసములచేత- కలయన్=కలియునట్లు- మర్దన చేసి=మర్దించి- కడు దీసి=తరువాత దానినిదీసి- తగిన=ఒకవిధముగా నొప్పునట్టి- కోపులు చేసి=కణికలు చేసి- తడియార్చి=ఆరబెట్టి- అవి=ఆకణికలు- దాచి=భద్రపరచి- అదనుకొలఁదిన్=సమయమునుబట్టి- అనుపానములతోడన్=అనుపానములతో- ఇట్టి=ఈవిధమగు- చంద్రప్రభావతియను నంజనమును- ఎనసి=తీసికొని- కన్నుగవలయందిడన్=రెండు కన్నులకును పట్టించినయెడల- పువ్వులు=పువ్వులును- నవలు=నురదలును- పొరలు=పొరలును కాయలును=కాయలును- మానున్=మానును.

తా. ఆడుదాని తలపెంకును, మణిసిలయు, ఇందుగుగింజలును, కోడిగ్రుడ్లపెంకులును, వసయు, సముద్రఫేనమును, ఆముదపుపప్పును, పిప్పళ్ళను సమభాగములుగా మాదీఫలపురసముచేతను, నిమ్మపండ్లరసముచేతను నూరితీసి కణికలుచేసి యుంచుకొని సమయమునుబట్టి అనుపానముతో కన్నులకుఁ బట్టించినయెడల పువ్వులు, నురదలు, పొరలు, కాయలు మొదలయినవి పోవును.

## 10 అర్ధచంద్రోదయాంజనము.

సీ. శ్రీగంధమగురుమంజిష్టియిందుగువిత్త
నములుసారతికప్పురమును బ్రమాని
పసపుముస్తెలుగూడఁబాలయుఁబటికిశం
ఖముమండపసపునుకావిఱాయి
సరిగూర్చియంతకుసరిమైలుతుత్తము
నెసఁగగజంబీరరసముఁచేతఁ
దెగనూరికణికలింపుగఁజేసికన్నులఁ
బానీయములఁజన్నుబాలనైన
నర్ధచంద్రోదయాంజనంబర్థివేయఁ
బుసులుకాయలుపటలముల్నసలుపొరలు
వరుసఁగామానురామశ్రీవత్సధామ
జలధరశ్యామదేవతాసార్వభౌమ.

టీ. శ్రీవత్స=శ్రీవత్సమనుచిహ్నముచే- ధామ=ప్రకాశించునట్టివాఁడా- జలధర=మేఘమువంటి, శ్యామ=నల్లనిరూపముగలవాఁడా- దేవతాసార్వభౌమ=దేవతలలో శ్రేష్ఠుఁడా- రామ=ఓశ్రీరామా- శ్రీగంధము=మంచిగంధమును- అగురు=అగురుగంధమును, మంజిష్టి=మంజిష్టమును- ఇందుగువిత్తనములున్=ఇందుగకాయ గింజలును- [వారిప్రసాధన] ఆరతికప్పురమును=ఆరతికర్పూరమును- ప్రమానిపసపు=ప్రమానిపసపును- ముస్తెలు=తుంగదుంపలు- కూడన్ = కలియునట్లు- పాలయు = పాలసుగంధియు- పటికి=పటికయు శంఖమున్=శంఖమును- మండ=ఉసిరికయు- పసుపును = హరిద్రమును కావిఱాయి = ఎఱ్ఱని సుద్దఱాయియు, సరిగూర్చి = సమాన భాగములుగాఁ జేసి అంతకుసరి = పయినఁజెప్పిన వస్తువుల భాగములప్రకారమే- మైలుతుత్తము = మైలుతుత్తమును- ఎసఁగగన్ = ఒప్పునట్లు- జంబీర రసముచేతన్ = నిమ్మపండ్లరసముతో- తెగనూరి = ఎక్కువగానూరి- ఇంపుగన్ = చక్కఁగా- కణికలు, చేసి=ఒనర్చి- కన్నులన్=కనులయందు- పానీయములన్=నీటితోనైనను- చన్నుబాలనైనన్=చనుబాలతోనయిన అర్ధచంద్రోదయాంజనంబు= అర్ధచంద్రోదయమను పేరుగల కాటుకను- అర్థిన్=కోరికతో- వేయన్=వేసినట్టయిన- పుసులున్=పుసులును- కాయలు=కాయలును- పటలముల్= రక్తశుక్లాదిపటలములును- నసలున్=దురదలును- పొరలు=పొరలును- వరుసగా=క్రమముగా- మానున్=నివర్తించును.

తా. మంచిగంధము, అగరుసు, మంజిష్టమును, ఇండుపగింజలును, ఆరతికర్పూరమును, గోనిపసపును, తుంగముస్తలును, పాలసుగంధియు, పటికయు, శంఖమును, ఉసిరికపప్పును, పసపును, ఎఱ్ఱనిసుద్దరాయియు, మైలుతుత్తమును, సమానభాగములుచేసి నిమ్మపండ్లరసముతో పాకముగా నూరి కణికలుచేసి నీటితోగాని. చనుబాలతోగాని అరగదీసి కనులకుఁబట్టించినచో పుసులు, కాయలు, పటలములు, దురదలు, పొరలు మానును.

## 11 నయనామృతాంజనము

చ. అరయఁగతుత్థయుగ్మమురసాంజనసైంధవసింధుఫేనముల్
మిరియముటంకణంబునిడిమెత్తగనిమ్మలపండ్లనేటిచే
నరగఁగనూరినట్టినయనామృతమొప్పఁగఁగన్నులందిడన్
పొరలునుపూలుపొక్కులునుపుండ్లునుదూలలడంగుమాధవా.

టీ. మాధవా=విష్ణుమూర్తీ, అరయఁగన్=ఆలోచించఁగా, తుత్థయుగ్మమున్=మైలుతుత్తము, పాలతుత్థమును, రసాంజన=ఇంగిలీకమును, సైంధవసింధుఫేనముల్=సైంధవలవణము సముద్రపునురుగును, మిరియము=మిరియములును టంకణంబున్=వెలిగారమును, ఇడి=సమానభాగములుగానుంచి, మెత్తగన్=మెత్తగా, నిమ్మలపండ్లనీటిచేన్=నిమ్మపండ్లరసముతో, అరగఁగన్=అరుగునట్లు, నూరినట్టి=మర్దనచేసినటువంటి, నయనామృతము=నయనామృతమనునంజనము, ఒప్పఁగన్=ఒప్పునట్లు, కన్నులందిండన్=కనులయందుపట్టించినయెడల, పొరలును, పూలు=పువ్వులును, పొక్కులును=పొక్కులును, పుండ్లును=కురుపులును, దూలలు=దురదలును, అడంగున్=అడగిపోవును.

తా. మైలుతుత్తము, నీలితుత్తము, రసాంజనము, సైంధవలవణము, సముద్రపునురుగు, మిరియములు, వెలిగారము, నిమ్మపండ్లరసముతోనూరి కన్నులయందుఁబెట్టినయెడల పొరలును, పువ్వులు, పొక్కులు, పుండ్లు, దురదలుపోవును.

## 12 మారీచాంజనము.

ఉ. కర్పరమైలతుత్థములుగైరుశంఖరసాంజనంబులన్
నేర్పుగనబ్ధిఫేనముమణిశ్శిలయుం *త్రిఫలమ్ములొక్కటై
తేర్పడనిమ్మపండ్లరసమిచ్చుచునూరియుఁగన్నులందిడన్
మార్పడునేత్రరోగములుమంటలుపూవులుమానుకేశవా.

* త్రిఫల=కరకతాడియుసిరికలు. త్రిఫల=ద్రాక్షాకాశ్మర్యఖర్జూరఫలములు. త్రిఫల=జాజీలవంగపూగఫలములు. ఇవి వైద్యపరిపాటింగనివాడుకొనవలెను.

టీ. కేశవా=విష్ణుమూర్తి, కర్పరమైలుతుత్థములు=తలపుర్రె, మైలతుత్తమును, గజ్జె
రు=గజ్జేరును, శంఖరసాంజనంబులున్=శంఖము,రసాంజనమును, నేర్పుగన్=జాగ్రత్తతో
అబ్ధిఫేనము=సముద్రపునురుగును, మణిశిలయున్=మణిశిలయును, త్రిఫలమ్ములు= కర
కతాడియుసిరికలును, ఒక్కయెత్తు=సమానభాగము, ఏర్పడన్=ఏర్పాటుగా, నిమ్మపం
డ్లరసము=నిమ్మపండ్లనీరు, ఇచ్చుచు=పోయుచు, నూరియు=మర్దనచేసి కన్నులందిడన్=
కండ్లకుబట్టించిన యెడల, మార్పడు=రూపుమాయు, నేత్రరోగములు=కనులజబ్బులు,
మంటలు, పువ్వులు, మానున్=మానిపోవును.

తా. తలపెంకు, మైలుతుత్తము, గజ్జేరు, శంఖము, రసాంజనము, సముద్రపునురు
గు, మణిసిల, కరకతాడియుసిరికలు- సమానభాగములుచేసి నిమ్మపండ్లరసముతో నూరి
కనులకుబట్టించిన యెడల, అందవిహీనమును తెచ్చు నేత్ర రోగములు, మంటలు.
పువ్వులు, నివర్తించును.

## 13. తిలకాంజనము.

చ. క్రమముననల్లమిర్యములుగర్పరముందగనువ్వుపువ్వులన్
హిమకరనేత్రవేదములనేర్పడఁబాళ్లిడినిమ్మపుల్సచే
నమరగనూరినట్టితిలకాంజనమక్షులయందుఁబెట్టినం
దిమిరముబుద్బుదంబులునుదీటలుపూవులుమానుగేశవా.

టీ. కేశవా=విష్ణుమూర్తీ,నల్లమిర్యములు=నల్లమిర్యములును,కర్పరమున్=తలపుర్రె
యును నువ్వుపువ్వులన్=నూవుపూవులును,తగన్=బాగుగ,హిమకర=ఒకపాలును, నేత్ర=
రెండుపాళ్ళును, వేదములన్=నాలుగుపాళ్ళును, క్రమముగన్=వరుసగా, ఏర్పడన్=ఏ
ర్పాటుగా, పాళ్ళిడి=భాగములుచేసి, నిమ్మపుల్సచేన్=నిమ్మపండ్లరసముతో, అమర
గన్=శ్రద్ధతోకలియునట్లు, నూరినట్టి=మర్ధించినటువంటి, తిలకాంజనము=తిలకమను పేరు
గలయీకాటుక, అక్షులయందున్=కనులయందు, పెట్టినన్=పట్టించినయెడల, తిమిర
ము=చీకట్లుగ్రమ్ముటయు, బుద్బుదంబులున్=నీరుబట్టుటయును, తీటలు=దురదలును
పూవులు=పువ్వులును, మానన్=నివర్తించును.

తా. ఒకపాలు నల్లమిరియమును, రెండుపాళ్ళుపుర్రెపెంకును నాలుగుపాళ్ళు
నువ్వుపువ్వును నిమ్మపండ్లరసముతో నూరి కనులకుబెట్టినయెడల కనులచీకట్లు గ్రమ్ముట
నీరుబట్టుటయును దురదలును, పువ్వులునుమానును.

## 14. స్ఫటికాంజనము.

సీ. పటికలొద్దుగచెక్కకటుకత్రయమురసాం
జనమునుగఫరియుసైంధవమును

మాయూరతుత్థంబు మధుకవిళంగముల్
కానుగవిత్తులుకరకకాయ
బరడువంగముసీసభస్మంబుచక్కెర
పానకంబునిమ్మపండ్లరసము
కలగరరసమునఁగలియంగమర్దించి
కణికలుగాజేసికనులనిడిన
పువ్వులెరుపులుదూలలుపుసులుపసిరి
కలునుదుర్మాంసపటలకాచలునుమాను
నవనిస్ఫటికాంజనంబిదిహతవిరాధ
ఆశ్రితామరయూధలోకైకనాథ.

టీ. హతవిరాధ = విరాధునిసంహరించిన వాఁడా, ఆశ్రిత=ఆశ్రయింపఁబడిన అమరయూధ = దేవసమూహము గలవాఁడా, లోకైకనాథ = లోకములన్నిటికి నొక్కఁడవే ప్రభువైన విష్ణుమూర్తీ, పటిక = పటికయు, లొద్దుగచెక్క = లొద్దుగచెట్టుపట్టయును- కటుకత్రయము=శొంఠిపిప్పలి మిరియములును- రసాంజనమును=ఇంగిలీకమును- కఫరియు=పాలతుత్థమును- సైంధవమును- సైంధవలవణమును- మాయూరతుత్థంబు=మైలుతుత్థమును- మధుక=యష్టిమధుకము- విళంగములు=వాయువిళంగములును- కానుగవిత్తులును=గానుగగింజలును- కరకకాయబరడు- వంగభస్మము- సీసభస్మము- చక్కెరపానకంబునన్=చక్కెరతోఁజేసిన పానకముతో- నిమ్మపండ్లరసముతోడను- కలగరరసమునన్=గుంటకలగరరసముతోడను- కలియంగమర్దించి=కలియునట్లునూరి- కణికలుగాఁజేసి- కనులనిడినన్=కనులకుపెట్టగా- పువ్వులు- ఎఱుపులు- దూలలు=దురదలును- పుసులు- పసిరికలు=పచ్చదనమును- దుర్మాంస=కొయ్యగండలుపెరుగుటయు- పటల=పొరలజబ్బులును- కాచలు=నాలుగువిధములగు కాచరోగములును- అవనిన్=ఈ ప్రపంచమునందు- స్ఫటికాంజనము=స్ఫటికాంజనమనుపేరుగలఇది=ఈ యౌషధమువలన- మాను ను=మానిపోవును.

తా. పటిక లొద్దుగచెక్క, కటుకత్రయము, ఇంగిలీకము, పాలతుత్తము సైంధవలవణము, మైలుతుత్తము, యష్టిమధుకము, వాయువిళంగములు, గానుగవిత్తులుకరకకాయపెచ్చులు, వంగభస్మము, సీసభస్మము చక్కెరపానకముతోను, నిమ్మపండ్లరసముతో గుంటకలగరాకురసముతో నూరికణికలుజేసి అరగదీసి కనులకుఁబెట్టిన యెడలపువ్వులు, ఎరుపులు, దురదలు, పుసులు, పసరికలు, కొయ్యగండలు పటలరోగములుకాచలునుమానును.

## 15 కతకాంజనము.

సీ. చిల్లవిత్తులు మణిశిలనాభిశంఖంబు
సైంధవమ్మును రసాంజనసముద్ర
ఫేనంబులును శొంఠిపిప్పలిమిరియముల్
కొత్తవిళంగముల్ కోడిగ్రుడ్డ
పెంకులు సరిగూర్చి ప్రీతితో జంబీర
ఫలరసంబున మోదమలర నూరి
కణికలుగాఁ జేసి గాడ్పార్చి తేనెతో
నను వొప్పఁగాఁ గన్నులందు నిడిన
తిమిరపటలంబులును కాచసముదయంబు
వర్తిరోగగణంబులుద్వృత్తిఁ బుసులు
విమలముగ మాను గతకాంజనమున నీశ
యఖిలలోకేశ శ్రీకృష్ణయఘవినాశ.

టీ. చిల్లవిత్తులు = ఇండుపగింజలు- మణిశిల = మణిశిలయు- నాభి = నాభియు- శంఖంబు = శంఖభస్మమును- సైంధవమ్మును = సైంధవలవణమును- రసాంజన = ఇంగిలీకమును, సముద్రఫేనంబు = సముద్రపునురుగును- శొంఠి = శొంఠియు- పిప్పలి = పిప్పలికట్టెయు- మిర్యముల్ = మిరియములును- కొత్తవిళంగముల్ = శుభ్రమగు వాయువిళంగంబులును- కోడిగ్రుడ్డ పెంకులును- సరిగూర్చి = సమానభాగములు చేసి- ప్రీతితో = శ్రద్ధతో- జంబీరఫలరసంబునన్ = నిమ్మపండ్లరసముతోడను- మోదమలరన్ = బాగుగా- నూరి = మర్దించి- కణికలుగాఁజేసి- గాడ్పార్చి = నీడనారబెట్టి- తేనెతోన్ = మధువుతో- అరగదీసి- అను వొప్పఁగాన్ = చక్కగాను- కన్నులందున్ = నేత్రములయందును- ఇడినన్ = పెట్టినయెడల- తిమిర = నీకట్లును- పటలంబులును = పొరలును- కాచసముదయంబును = కాచరోగసమూహమును- ఉద్వృత్తి = ఎక్కువగా- వర్తిరోగగణంబులు = వర్తియను పేరుగల (ఏమపరెలలోఁ బుట్టురోగము) రోగసమూహములును, పుసులు, ఈశ, కతకాంజనమునన్ = ఈకతకమను పేరుగల కాటుకచేత, ఈశ, అఖిలలోకేశ, అఘవినాశ = పాపములను పోగొట్టువాఁడా, శ్రీకృష్ణ = కృష్ణమూర్తి, విమలముగన్ = నిశ్శేషముగా, మానున్ = నివర్తించును.

తా. ఇండుపగింజలు, మణిశిల, నాభి, శంఖభస్మము, సైంధవలవణము, ఇంగిలీకము, సముద్రపునురుగు శొంఠి పిప్పలి మిర్యములు వాయువిళంగములు, కోడిగ్రుడ్డ పెంకులును, సమానభాగములుగా చేసి, నిమ్మపండ్లరసముతో నూరి కణికలు చేసి నీడనారనిచ్చి తేనె

తోనూరి కనులకుఁబట్టించినయెడల చీకట్లు, పొరలు, కాచలు వగైరా రోగములు పుసులును మానును.

## 16 హారిద్రాభాంజనము.

సీ. మంచిపసపు రక్తమణిశిలపిప్పళ్ళు
నల్లనిమిర్యముల్ నాభిశంఖు
వేవయిగురు తాడివిత్తులు కానుగ
విత్తులపల్కులొక్కొక్కటి మేక
పంచితంబునఁగాని పాలతోడనుగాని
మూఁడుపొద్దులునూరిముఖ్యముగను
కణికలుగావించిగాడ్పార్చినీడను
పానీయమునునైనఁదేనెనైనఁ

గీ. గన్నులకు వేయ దురదలు కాచలెరుపు
పొరలుపొక్కులుపుసులునుపూలుకూన
లంటులడఁగించునీహారిద్రాభనామ
కాంజనంబునవికసితకంజనయన.

టీ. వికసిత=వికసించిన- కంజ=పద్మమువంటి- నయన=నేత్రములుగల విష్ణుమూర్తి! మంచిపసపు, రక్తమణిశిల, పిప్పళ్ళు, నల్లనిమిర్యముల్=నల్లనిమిరియములును- నాభి- శంఖుంబు=శంఖభస్మము- వేపయిగురు=వేపచిగుళ్ళును- తాడివిత్తులు- కానుగవిత్తులపల్కులు- ఒక్కొక్కటి=ఒక్కొక్కభాగము- మేకపంచితంబునఁగాని- పాలతోడనుగాని మూఁడుపొద్దులు=మూఁడుదినములు- నూరి=మర్దనచేసి- ముఖ్యముగను=ప్రశస్తముగా కణికలుగావించి=కణికలుగాఁజేసి- నీడను- గాడ్పార్చి=గాలినారబెట్టి- పానీయమునైనన్=నీటితోనైనను- తేనెనైనన్=తేనెతోనైనను- కన్నులకు వేయన్=కనులకు నూరి పట్టించినయెడల-దురదలు- కాచలు=కాచరోగములు-ఎరుపుపొరలు=ఎఱ్ఱనిపొరలును పొక్కులు- పుసులు-పూలు=పువ్వులు-కూనలు=కనులలో వేయు కూనలను జబ్బులును, అంటులు=అంటుకొనుటలును- ఈహారిద్రాభనామకాంజనంబునన్= ఈచెప్పినహారిద్రాభమను పేరుగల కాటుకచేత- అడఁగించున్=నివారించును.

తా. ఒక్కొక్కభాగము సరిగామంచిపసపు, రక్తమణిశిల, పిప్పళ్ళు, నల్లమిర్యములు నాభి, శంఖభస్మము, వేపచిగుళ్ళు, తాడిగింజలు, గానుగగింజలు, మేకపంచితముతోనైనను లేక పాలతోనైనను మూడుదినములునూరి కణికలుచేసి ఆరబెట్టి నీళ్ళతోనై

న తేనెతోనైన అరగదీసి కనులకుంబట్టించినయెడల దురదలు,కాచలు, ఎరుపుపొరలు, పొక్కులు, పుసులు, పుష్పలు, కూనలు, అంటుకొనుట, మానును.

## 17 అమృతాంజనము.

సీ. ఆరతికర్పూరమబ్ధిఫేనమునాభి
శంఖంబుపసపునుసైంధవమును
మైలుతుత్తముయష్టిమధుకంబురోహిణి
మంచిగంధమ్మునుమ్రానిపసపు
కటుకత్రయమ్మును గవ్వలునీలాంజ
నంబునుగరుడాంజనమ్ముసమము
మాతులుంగరసమ్ముచేతనుమర్దించి
కణికలుగాఁజేసికన్నులందు
తే. తేనెనైనను మరినేతనైనఁగాని
కలిపివేసిన నయనరోగములణఁచుఁ
గాననయనామృతంబిది కమలనేత్ర
చారుతరగాత్ర క్షీరాబ్ధిజాకళత్ర.

టీ. కమలనేత్ర= పద్మములవంటి నేత్రములుగలవాఁడా, చారుతర= మిక్కిలి సుందరమయిన, గాత్ర= శరీరముగలవాఁడా- క్షీరాబ్ధిజాకళత్ర= లక్ష్మీదేవిభార్యగాఁగల విష్ణుమూర్తీ- ఆరతికర్పూరము= ఆరతికర్పూరమును- అబ్ధిఫేనము= సముద్రపు నురుగును- నాభి= నాభియు- శంఖంబు=శంఖభస్మము, పసపును, సైంధవమును=సైంధవలవణమును, మైలుతుత్తము. యష్టిమధుకంబు, రోహిణి=కటుకరోహిణియు. మంచిగంధమ్మును=మంచిగంధమును, మ్రానిపసపు, కటుకత్రయమ్మును=శొంఠిపిప్పలి మిరియములును, గవ్వలు=గవ్వభస్మము (వరాటభస్మము) నీలాంజనంబును గరుడాంజనమ్మును, సమము=సమానభాగములు, మాతులుంగరసమ్ముచేతను=మాదీఫలరసముచేతను, మర్దించి=నూరి, కణికలుగాజేసి, తేనెనైనను=తేనెతోనైనను, మరి=లేక, నేతనైనఁగానిన్=నేతితోనైనను. కలిపి=అరగదీసి, కన్నులందు,వేసినన్=వేసినయెడల,నయనరోగములన్=కంటిజబ్బులను, అణఁచుఁగానన్=పోఁగొట్టునుగావున, ఇది=ఈయౌషధము, నయనామృతము=నేత్రములకు అమృతమువంటికాటుక.

తా. ఆరతికర్పూరము, సముద్రపునురుగు, నాభి, శంఖభస్మము, పసపు, సైంధవలవణము, మైలతుత్తము, యష్టిమధుకము, కటుకరోహిణి, మంచిగంధము, మ్రాని పసపు, శొంఠిపిప్పలి మిరియములు, వరాటభస్మము, నీలాంజనము, గరుడాంజనము, సమభాగము

లుచేసి మాదీఫలరసముతో నూరి, కణికలుజేసి తేనెతో నైనను నేతితో నైనను అరగదీసికనుల కుఁబట్టించినయెడల నేత్రరోగములుమానును.

18 వ్యోషాంజనము.

సీసమాలిక.

మాయూరతుత్థంబుమ్రాన్పుస్పురోహిణి,
ప్రత్యేకమొక్కొక్కపాలుదనరఁ
బసుపులొద్దుగద్రాక్షపండ్లుకొబ్బరిమంచి
గంధమువసయునుగావిఱాయి
చందనంబునురసాంజనమునువేర్వేఱ
రెండేసిభాగంబులుండనొసఁగి
మూఁడేసిభాగముల్ముఖ్యంబుగాఁద్రాము
మునొగిఁబటికయునుబుండరీక
మునునాభిశంఖంబునుయష్టిమధుకంబు
సైంధవలవణంబుసరవిఁగల్పి
నాల్గేసిపాళ్ళుగానక్కెరవిత్తులు
కాన్గుత్రిఫలవిళంగత్రికటుక
మొసఁగికానుగవ్రేళ్ళరసమునమర్దించి
కణికలుగాఁజేసికనులనిడినఁ
గనులరోగంబులుకాచలుపువ్వులు
మంటలంటులునుదుర్మాంసములును
గ్రంథులెరుపులుకూనలుకాయలర్బు
దములుమందాక్షులునుబుద్బుదములుఁదరు
నసలుమానునువ్యోషాంజనమునసీశ
దళితభవపాశవరసుదంతాహ్వనీశ.

టీ. మాయూర తుత్థంబు=[illegible]యిలు తుత్తమును, మ్రాన్పుస్పు=మానిపసపును-రోహిణి=కటుకరోహిణియును, ప్రత్యేకము, ఒక్కొక్కపాలు=ఒక్కొక్క భాగము-తనరఁగ, పసవు, లొద్దుగ=లొద్దుగచెక్క, ద్రాక్షపండ్లు, కొబ్బరి, మంచిగంధము, వస యును, కావిరాయి, జేసురురాయి. చందనంబును=హరిచందనమును, రసాంజనమును=

ఇంగిలీకమును, వేర్వేఱన్=వేరువేరుగా, రెండేసిభాగములు ఉండన్=ఉండునట్లు, ఒసఁగి=ఉంచి ముఖ్యముగాన్=సరిగా, తామ్రమున్= తామ్రభస్మమును, ఒగిన్=వరుసగా, పటికయున్=పటికయును, పుండరీకమును=తెల్లతామరయు, నాభి, శఖంబునుఁ=శంఖభస్మమును, యష్టిమధుకంబు, సైంధవలవణంబుఁ=సైంధవలవణమును, మూడేసిభాగములు, సరవిన్=క్రమముగా, కల్పి=కలిపి, నక్తారవిత్తులు=నక్తారగింజలును, కాన్గు=కానుగగింజలు, త్రిఫల=కరకతాడియుసిరికలును, విళంగ=వాయివిళంగములును, త్రికటుకము=శొంఠిపిప్పలిమిరియములును, నాల్గేసిపాళ్ళుగాన్= నాలుగేసిభాగములుగా ఒసఁగి=ఉంచి, కానుగవ్రేళ్లరసమునన్= గానుగువేళ్ళరసముతో, మర్దించి=నూరి, కణికలుగాఁజేసి= కణికలుగానొనర్చి, కనుల నిడినఁ=కనులకు బెట్టినయెడల, కనులరోగంబులు=నేత్రవ్యాధులగు, కాచలు=కాచరోగములు, పువ్వులు మంటలు అంటులును=అంటుకొనుటలును, దుర్మాంసములును=కొయ్యగండలు పెరుగుటయు, గ్రంథులు=రెప్పలమీఁద ముళ్ళుగాకాయు కాయులు (అగ్నిగ్రంథులు) ఎఱుపులు=యెఱ్ఱబడుటయు, కూనలు కాయలు అర్బుదములు=పద్మార్బుదములను రోగ విశేషములును, మందాక్షులును=కనులు మందము గలిగియుండుటయు, బుద్బుదములు=పొంగిరించుట, నీరు=నీరు పట్టుట, నసలు=దురదలు, వ్యోషాంజనమునఁ=ఈవ్యోషమను పేరుగల కాటుక చేత్త, మానును=నివారించును.

తా. మైలుతుత్తమును, మ్రానిపసపు, కటుకరోహిణి, వేరుగాఒక్కొక్కభాగమును, పసపు, లొద్దుగచెక్క, ద్రాక్షపండ్లు, కొబ్బరి, మంచిగంధము, పసు, జేగురురాయి హరిచందనము, ఇంగిలీకము వేరువేరుగారెండేసిపాళ్ళును, తామ్రభస్మము, పటిక, తెల్లతామర, నాభి, శంఖభస్మము, యష్టిమధుకము, సైంధవలవణము, మూడేసిపాళ్ళును, వరుసగాకలిపి నక్తారగింజలు, గానుగగింజలు, కరకతాడియుసిరికలు, వాయివిళంగములు, శొంఠి పిప్పలి మిరియములు, నాలుగేసిపాళ్ళును, చేసి కానుగవ్రేళ్ళరసముతో మర్దించి కణికలుచేసి కనులకుఁబట్టించినయెడల కాచలు, పువ్వులు, మంటలు, అంటుకొనుట, కొయ్యగండలు పెరుగుట. రెప్పలపయిముళ్ళగాకాయు కాయలు, ఎఱ్ఱబడుట, కూనలు, గ్రుడ్డుమీదికాయలు, పద్మార్బుదములను రోగములు, కనులమందము, పొంగరించుట, నీరుపట్టుట, దురదలును మానును.

## 19 విద్రుమాంజనము.

సీసమాలిక.

అమరంగసీసవిద్రుమతామ్రపారద
ములవిభూతులుదుంగముస్తలెసఁగ
గరకకాయలుతెల్లగంటెలవిత్తులు
చింతగింజలుపుత్రజీవిగడ్డ

కాసీసమును గటుకత్రయమ్ము రసాం
జనము లొద్దుగ సైంధవమును
మాయూరతుత్థంబు మంచి జేగురుటాయి
సవ్వీరాంజనమును సమముగూర్చి
వేపాకురసమున వెలయ నూరినముద్ద
బాగు మీఱంగ రాగిపళ్ళెరమ్ము
పైనుంచి తేనె నాపైఁ బోసి యది రాగి
ముంత చే మర్దించి ముఖ్యముగను
కనులఁ బెట్టిన విషరోగగణము మఱియుఁ
బువ్వులను రెప్పదురదలఁ బోణిమ నణఁచు
విద్రుమాంజన మిది యగు విహగవాహ
వితతచారిత్ర శతపత్రవిమలనేత్ర.

టీ. వితత= మిక్కిలిఘనమయిన, చారిత్ర= చరిత్రముగలవాఁడా! శతపత్ర=తామరరేకులవంటి, విమల=స్వచ్ఛమయిన, నేత్రా=నేత్రములుకలవాఁడా! విహగవాహ=పక్షియేవాహనముగాఁగల విష్ణుమూర్తీ! అమరంగన్= ఒప్పునట్లు, సీస= సీసముయొక్కయు, పారద= పాదరసముయొక్కయు, విభూతులన్= భస్మములును, తుంగముస్తలు= తుంగదుంపలు, ఎసఁగన్= ఒప్పునట్లు, కరకకాయలు, తెల్లగంటెవిత్తులు, చింతగింజలు, పుత్రజీవిగడ్డ= పుత్రజీవియను చెట్టుయొక్కదుంపయు, కాసీసమును= పాలతుత్తమును, కటుకత్రయమ్మును= శొంఠి పిప్పలి మిరియములును, రసాంజనమును=ఇంగిలీకమును, లొద్దుగ= లొద్దుగచెక్కయు, సైంధవమును= సైంధవలవణమును, మాయూరతుత్థంబు= మైలుతుత్తమును, మంచిజేగురుటాయి, సవ్వీరాంజనమును= సౌవీరాంజనమును, సమముగూర్చి= సమానభాగములుచేసి, వేపాకురసమునన్= వేపాకురసముచేత, వెలయన్= చక్కఁగా, నూరినముద్ద= నూరినట్టిముద్ద, బాగుమీఱంగన్= నేర్పుతో, రాగిపళ్ళెరమ్ముపైన్= రాగిపళ్లెముమీఁద, ఉంచి= పెట్టి, ఆపైన్= దానిమీఁద, తేనెన్= తేనెను, పోసి, అది= ఆముద్దను, రాగిముంతచేన్= రాగిచెంబుచేత, మర్దించి= నూరి, ముఖ్యముగన్= శ్రద్ధతో, కనులఁబెట్టినన్= కనులకుఁ బట్టించినయెడల, విషరోగగణము= దుష్టరోగసముదాయమును, మఱియున్= ఇంతియేకాక, పువ్వులను= కనులలోవేయు పువ్వులను, రెప్పదురదల= రెప్పలలోని దురదలయొక్కయు, పోణిమి= ఔన్నత్యమును, అణఁచున్= అణఁచివేయును. ఇది= ఈయౌషధము, విద్రుమాంజనము= విద్రుమాంజనమను పేరుగలది.

తా. సీసభస్మము, పగడభస్మము, తామ్రభస్మము, పాదరసభస్మము, తుంగముంపలు, కరక కాయలు, తెల్లగంటెలు, చింతగింజలు, పుత్రజీవిగడ్డ, పాలతుత్తము, శొంఠి పిప్పలి మిరియములు, ఇంగిలీకము, లొద్దుగచెక్క, సైంధవలవణము, మైలుతుత్తము, జేగురుఖాయి, సౌవీరాంజనము, సమానభాగములుచేసి, వేపాకురసముతో నూరి ముద్దచేసి యాముద్దను రాగిపళ్ళెముమీఁద పెట్టి తేనెవేసి రాగిముంతతో మర్దించి దానిని కనులకుఁ బట్టించినయెడల కనులకుగలుగు చెకుజబ్బులను, పువ్వులను, రెప్పలలోని బురదలను పోగొట్టును:

## 20 గరుడాంజనము.

### సీసమాలిక.

ఏలకుల్ పటిక మిర్యాలులక్కయుమంచి
గందంబుపసపుఁజెంగల్వకోష్టుఁ
దలపెంకుఁగోడిగ్రుడ్డులపెంకులునునాభి
శంఖరసాంజన సైంధవములు
మాయూరతుత్థంబు మణిశిలచిల్లగిం
జలుదేవదారు గుగ్గిలరసాంజ
నములుసముద్రఫేనము విష్ణుక్రాంతయు
నారతికర్పూర మమరఁగూర్చి
మేకపాలనునీలియాకులరసమున
గుంటకల్గరపొన్నగంటితెల్ల
గలిజేరురసములఁగలయుంగమర్దించి
కణికలుగావించి గాలుపార్చి
యనుకూలమయినట్టి యనుపానములకొద్ది
సవరణగాఁగన్నుఁగవలనిడిన
దురద్దులుపటలముల్ దుర్మాంసములుకాయ
లిరుకులుపొక్కులుపొరలుపూలు
కోడికెప్పలు రేజీకుఁగుటిలరోగ
గణములనుబాపి కలిగించుగరుడదృష్టిఁ

గానగరుడాంజనంబంద్రుగరుడవాహ
సంతతోత్సాహఘననిభశ్యామదేహ.

టీ. సంతతోత్సాహ=ఎల్లప్పుడును ఉత్సాహముతోఁగూడుకొనినవాఁడా? ఘన=మేఘముతోఁ,నిభ=సమానమయిన, శ్యామ=నల్లనయిన, దేహ=శరీరము గలవాఁడా! గరుడవాహ=గరుత్మంతుఁడే వాహనముగాఁగలవిష్ణుమూర్తీ! ఏలకుల్=ఏలకులును, పటిక, మిర్యాలు = మిరియములును, లక్క, యును, మంచిగందంబు = మంచిగంధమును- పసపుఁ=పసపును, చెంగల్వకోష్టుఁ=చెంగల్వకోష్టును, తలపెంకుఁ=తలపెంకును,కోడిగ్రుడ్డులపెంకులును, నాభి, శంఖ=శంఖభస్మమును, రసాంజన సైంధవములు=ఇంగిలీకము, సైంధవలవణమును, మాయూరతుత్థంబు=మైలుతుత్తము, మణిశిల, చిల్లగింజలు=ఇందుపుగింజలు, దేవదారు=దేవదారుచెక్కయు, గుగ్గిల=గుగ్గిలము, రసాంజనము=రసాంజనమును, సముద్రఫేనము=సముద్రపు నురుగు, విష్ణుక్రాంతయుఁ=విష్ణుక్రాంతయును, ఆరతికర్పూరము, అమరఁ=చక్కఁగా, కూర్చి=చేర్చి, మేకపాలను=మేకపాలతోఁను. నీలియాకురసమునఁ=నీలియాకు రసముతోఁను, గుంటకల్గర=గుంటకగరయొక్కయు, పొన్నగంటి=పొన్నగంటియొక్కయు తెల్లగలిజేర=తెల్లగలిజేరయొక్కయు, రసములఁ=రసములతోఁ, కలయఁగఁ=కలియునట్లు- మర్దించి=నూరి—కణికలుగావించి=కణికలుగాఁజేసి- గాలుపార్చి=నీడనారఁబెట్టి- అనుకూలమయినట్టి=తగినట్టి- అనుపానముల శొద్దిఁ=అనుపానములనుబట్టి- సవరణగాఁ=సరిగా- కన్నుగవలఁ=కనులయందు-ఇడినఁ=పెట్టినయెడల- దురదలు, పటలముల్=పటలరోగములు, దుర్మాంసములు, కాయలు, ఇరుకులు, పొక్కులు, పొరలు, పూలు, కోడిరెప్పలు, రేజీఁకు=రాత్రులయందు నేత్రములు గాన్పించకుండుట, కొటిలరోగగణములను=దుష్టరోగసమూహములను, పాపి=పోఁగొట్టి, గరుడదృష్టిన్=గరుత్మంతునిచూపుతో సమానమయిన చూపును,కలిగించున్=చేయును, కావునఁ=కాఁబట్టి, ఇది=ఈ యౌషధము, గరుడాంజనంబంద్రు=గరుడాంజనమని చెప్పెదరు.

తా. ఏలకులు, పటిక, మిరియాలు, లక్క, మంచిగంధము,పసపు, చెంగల్వకోష్టు, తలపెంకు, కోడిగ్రుడ్లపెంకులు, నాభి, శంఖభస్మము, ఇంగిలీకము, సైంధవ లవణము, మైలుతుత్తము, మణిశిల, ఇందుపగింజలు, దేవదారుచెక్క, గుగ్గిలము, రసాంజనము, సముద్రపునురుగు, విష్ణుక్రాంతము, ఆరతికర్పూరము, ఇవియన్నియు సమానముగాచేర్చి మేకపాలతోను, నీలియాకురసముతోను, గుంటకలగర రసముతోను, పొన్నగంటిరసముతోను, తెల్లగలిజేరరసముతోను, కలియునట్లుగానూరి, కణికలుచేసి నీడ నారఁబెట్టి తగినయనుపానములతో, కనులయందుబెట్టినయెడల, దురదలు, పటలములు, దుర్మాంసములు, కాయలు, ఇరుకులు, పొక్కులు, పొరలు, పువ్వులు, కోడిరెప్పలు, రాత్రి కన్నులు కాన్పించకుండుట, మరియు దుష్టరోగములన్నియుఁ బోగొట్టి గరుత్మంతునిదృష్టిని గలుగఁజేయును.

## 21. మహాగరుడాంజనము.

### సీసమాలిక.

వినుముసీసమురాగియినుపవిభూతులు
కటుకరోహిణివసకడలినురుగు
మైలుతుత్తమురక్తమణిశిలమధుకంబు
పటికమానిసిపుర్రెపాదరసము
త్రికటుకటంకణత్రిఫలంబులునునాభి
శంఖంబుపచ్చనిసైంధవమును
గవ్వలునారతికర్పూరముఁ రసాం
జనమునుచిల్లగింజలునుఁగూర్చి
కల్వంబునందుంచిగానుగచెక్కరసంబు
చేనూరికణికలుచేసిదాచి
ముద్గమాత్రముతోయమునఁదీసియీమహా
గరుడాంజనముకన్నుగవలనిడిన
నేత్రరోగములనుబాపినిర్మలముగ
దృష్టిఁగలిగించుగరుడునిదృష్టిమాడ్కి
నవనిజనములకానందమతిశయింప
నతిదయాసాంద్రవృష్ణికులాబ్ధిచంద్ర.

టీ. అతి=ఎక్కువైన, దయాసాంద్ర=దట్టమైయినదయగలవాఁడా ! వృష్ణికులాబ్ధి=యాదవకులమను సముద్రమునకు, చంద్ర=చంద్రునివంటి శ్రీకృష్ణమూర్తీ! వినుము=ఆలకింపుము. సీస=సీసముయొక్కయు, రాగి తామ్రముయొక్కయు, ఇనుము=ఇనుముయొక్కయు, విభూతులు=భస్మములును, కటుకరోహిణి, వస, కడలినురుగు, సముద్రఫేనము, మైలుతుత్తము, రక్తమణిశిల,మధుకంబు=యష్టిమధుకంబును పటిక=పటికయు మానిసిపుర్రె=మనుష్యుని తలపెంకును, పాదరసము, త్రికటుక=శొంఠి పిప్పలి మిరియములును, టంకణ=వెలిగారమును, త్రిఫలంబులును=కరక తాడి యుసిరికలును, నాభి, శంఖంబు=శంఖభస్మము,పచ్చని=పచ్చగానుండు, సైంధవమును=సైంధవలవణమును, గవ్వలు=వరాటభస్మమును, ఆరతికర్పూరమును, రసాంజనమును= ఇంగిలీకమును, చిల్లగింజలును=ఇండుపగింజలును, కూర్చి=చేర్చి, కల్వంబునందుంచి=కల్వమునందు వేసి, గానుగ చెక్కరసంబుచేత=కానుక చెక్కరసము చేత, నూరి=మర్దించి, కణికలు చేసి, దాచి=

భద్రపరచి, ముద్గమాత్రము=పెసరగింజప్రమాణము, తోయమునన్=ఉదకముతో, తీసి=అరగఁదీసి, ఈమహాగరుడాంజనము, కన్నుగవలనిడినన్=కనులయందుఁబెట్టినయెడల, నేత్రరోగములను=కనులజబ్బులను, నిర్మలముగన్=నిశ్శేషముగా, పాపి=పోఁగొట్టి. అవనిజనములకానందమతిశయింపన్=భూప్రజకు సంతోషము వృద్ధియగునట్లు, గరుడునిదృష్టిమాడ్కిన్=గరుత్మంతునిచూపుతో సమానముగా, దృష్టిగలిగించు=చూపునిచ్చును.

తా. సీసభస్మము, తామ్రభస్మము, ఇనుపభస్మము, కటుకరోహిణి, వస, సముద్రఫేనము, మైలతుత్తము, రక్తమణిశిల, యష్టిమధుకము, పటిక, తలవెంకు; పాదరసము, శొంఠిపిప్పలిమిరియములు, వెలిగారము కరకతాడిఱుసిరికలును, నాభి, శంఖభస్మము, సైంధవలవణము, వరాటభస్మము, ఆరతికర్పూరము, ఇంగిలీకభస్మము, ఇండుపగింజలును, సమానభాగములుచేసి, గానుగచెక్కరసముతోనూరి కణికలుచేసియుంచుకొని పెసరగింజంత ప్రమాణము నీటితో అరుగదీసి కనులకుబట్టించినయెడల కంటిజబ్బులన్నియుఁబోగొట్టి గరుత్మంతునిచూపువంటి చూపునిచ్చును.

## 22 నేత్రాంజనము.

సీ. పొసఁగసీసమునుక్కు రసములభస్మముల్
నాభిసౌవీరాంజనములుమఱియుఁ
బిప్పళ్ళునారతికప్పురంబునుసమం
బొసఁగిసంధ్యావర్తరసముచేత
నినుపకల్వంబునందినుపగూటమ్మునఁ
గలయఁగఁబటికింతగలిపితిరుగ
మర్దించియదితగుమాత్రంబునేర్పుతో
నయనంబులందిడనాణెముగను
దురదనెరుపులపువ్వులదుర్భరంపు
వర్తిరోగమ్ములనునేత్రవాతములను
శమనమొనరించునేత్రాంజనముకృపాల
వాలగోపాలతప్తసువర్ణచేల.

టీ. కృప=దయకు- ఆలవాల=పాదువంటివాడా! తప్తసువర్ణచేల=వన్నెయెక్కిన బంగారుబట్టగలవాఁడా! గోపాల=ఓగోపాలమూర్తి! పొసఁగన్=ఒప్పునట్లు- సీసమున్=సీసముయొక్కయు- ఉక్కు=ఉక్కుయొక్కయు- రసము=పాదరసముయొక్కయు- భస్మముల్=భస్మములు- నాభి=నాభియు-సౌవీరాంజనము=సౌవీరాంజనమును- మఱియు=ఇంకను-పిప్పళ్ళు- ఆరతికప్పురంబును, సమంబు=సమానభాగములు- ఒ

సఁగి=ఉంచి-సంధ్యావ ర్తరసముచేతన్=పొద్దుదిరుగుడుపువ్వురసముతో- ఇనుపకల్వంబునందు- ఇనుపగూటమ్మునన్=ఇనుపగూటముతో- కలయఁగన్=కలియునట్లు- ఇంతపటికను=కొంతపటికను- కలిపి- తిరుగమర్దించి=నూరలనూరి- అది=ఆయౌషధము, తగుమాత్రంబు=కొంచెము, నేర్పుతోన్=పదిలముగా, నయనంబులందు=కనులయందు, నాణెముగను=చక్కగా, ఇడన్=పెట్టినట్టయిన, దురదన్=దురదను, ఎరుపులన్=ఎరుపులను, పూవులన్=పువ్వులను, గుర్భరంపు=భరింప శక్యముకాని, వర్తిరోగమ్ములను=వర్తిరోగములను, (ఏడుపొరలలోపలబుట్టుజబ్బు) నేత్రవాతములను, నేత్రాంజనము=ఈయౌషధము, శమన మొనరించున్=శాంతింపజేయును.

తా. సీసభస్మము, ఉక్కుభస్మము, రసభస్మము, నాభి, సౌవీరాంజనము పిప్పళ్ళు ఆరతికర్పూరము, సమానభాగములుచేసి పొద్దుతిరుగుడుపువ్వురసముతో నినుపకల్వమందు ఇనుపగూటముతోనూరి పిదపకొంతపటికను కలిపి నూరలనూరి యాయౌషధము కొంచెము నేర్పుతో కనులకుఁబట్టించిన దురదలు ఎరుపులు, పువ్వులు, భరింపశక్యముగాని వర్తిరోగములును, నేత్రవాతములును పోవును.

## 23 సైంధవాంజనము.

సీ. పరిశుద్ధమైనట్టిపారదభసితంబు
సైంధవమ్మునరసాంజనముసీస
భస్మంబునుసిరికపప్పునుపిప్పళ్ళు
సమభాగములుగానుసంగ్రహించి
చూర్ణంబుగావించిచొక్కమౌచక్కెర
పానకానఁదములపాకుసీట
నేతనుచేనెనునేర్పుతోడనుకంచు
పళ్ళేరమందుంచిపైనరాగి
ముంతతోడనుమర్దించిముఖ్యముగను
గనులయందిడనేత్రరోగముల బాధ
లన్నియునుమానునీసైంధవాంజనమున.
నార్తజనరక్షపద్మపత్రాయతాక్ష.

టీ. ఆర్తజనరక్ష=ఆపదలుగలజనులను రక్షించువాఁడా! పద్మపత్ర=తామరరేకులవంటి, ఆయత=విశాలములయిన, అక్ష=నేత్రములుగలవిష్ణుమూర్తీ! పరిశుద్ధమైనట్టి=మిక్కిలిశుభ్రమయిన, పారదభసితంబు=పాదరసభస్మమును, సైంధవమ్మును=సైంధవలవణమును, రసాంజనమున్=ఇంగిలీకమును, సీసభస్మంబున్=సీసభస్మమును, ఉసిరికపప్పును.

పిప్పళ్ళు, సమభాగములుగాను=సరియైనపాళ్ళుగా,సంగ్రహించి=చేర్చి, చూర్ణంబుగావించి=పొడిచేసి, చొక్కమౌ=శ్రేష్ఠమైన,చక్కెరపానకానన్=చక్కెరపానకము చేతను, తములపాకునీటన్=తమలపాకురసముతోను, నేతను=నేతితోను. తేనెను=తేనెతోడను, నేర్పుతోడను=పదిలముగా, కంచుపళ్ళెరమందు=ఉంచి, పైన=తరువాత, రాగిముంతతోడను=రాగిచెంబుతో, మర్దించి=నూరి, ముఖ్యముగను=తప్పక, కనులయందిడన్=నేత్రములయందుఁబట్టించఁగా, ఈ సైంధవాంజనమునన్=ఈచెప్పినసైంధవాంజనమను పేరుగలకాటుకచే, నేత్రరోగముల=కనులజబ్బులయొక్క, బాధలన్నియును మానును.

తా. పాదరస భస్మము. సైంధవలవణము, ఇంగిలీకము, సీసభస్మము. ఉసిరికపప్పు, పిప్పళ్ళు, సమానభాగములుచేసి చూర్ణముచేసి చక్కెరపానకముతోను, తములపాకురసముతోను, నేతితోను, తేనెతోను, కంచుపళ్ళెముమీఁదవేసి రాగిచెంబుతో నూరి కనులకుబట్టించినయెడల నేత్రరోగముల బాధలన్నియునుమానును.

## 24 తారాంజనము.

సీ. రాగికంచునువెండిరసములభసితముల్
మైలతుత్థమునుకఫరిరసాంజ
నమునుమాత్రినిపసపునాభిశంఖమురోహి
ణియుసమాంశలుగానునిగుడఁగూర్చి
పదియామములుహంసపాదిరసమ్ముచే
మర్దించికణికలమర్చినట్టి
తారాంజనముయుక్తిదనరంగజలములు
మొదలుగాననుపానములనుదగిన
మాత్రముగఁదీసినేర్పుతోనేత్రములను
బెట్టిరేనియుమనుజులుబెట్టిదంపు
నేత్రరోగమ్ములెమ్మెనన్నియునుమాను
నార్తజనరక్షపద్మపత్రాయతాక్ష
దీనసంతానవృక్షసన్మౌనిరక్ష.

టీ. ఆర్తజనరక్ష=ఆపదలను బొందినజనులను రక్షించువాఁడా! పద్మపత్రాయతాక్ష=తామరరేకులవంటి విశాలమయిన నేత్రములు గలవాఁడా, దీన=దీన జనులకు, సంతానవృక్ష=కల్ప వృక్షము వంటివాడా, సన్మౌనిరక్ష=యోగ్యమయిన మునీశ్వరులను రక్షించు విష్ణుమూర్తీ! రాగి=తామ్రము యొక్కయు, కంచును=కంచు యొక్కయు, వెండి=వెండియొక్కయు, రసము=రసముయొక్కయు, భసితముల్=భస్మములును, మ

యిలుతుత్థమును, కఫరి=పాలతుత్థమును, రసాంజనమును=ఇంగిలీకమును, మాని పసపు నాభి, శంఖము=శంఖభస్మము, రోహిణి=కటుకరోహిణి, సమాంశలుగాను=సమాన భాగములుగా, నిగుడక=ఒప్పునట్లు, కూర్చి=చేర్చి, పదియామములు=పదిజాములు హంస పాదిరసమ్ము చేత=హంసపాదియాకు రసముతోడ, మదించి=నూరి, కణిక లమర్చిన ట్టి=కణికలుగాజేసినట్టి, తారాంజనము=ఈకాటుక, యుక్తిదనరంగన =సమయ మాలోచించి, జలములు మొదలుగాన్=నీరు మొదలయినట్టి, అనుపానములను=అనుపానములతో, తగినమాత్రముగన=కనులకుఁ బట్టించుటకుఁ జాలినంత, తీసి=అరగఁదీసి, నేర్పుతో==నేర్పుతో, మనుజులు=మనుష్యులు నేత్రములను బెట్టిరేనియున=కనులకు బట్టించినట్టయిన, బెట్టిదంపు=అశక్యమయిన, నేత్రరోగమ్ములు=కంటిజబ్బులు, ఎమ్మెన్= నిశ్శేషముగా, అన్నియును మానున=అన్నియును నివారించును.

తా. తామ్రభస్మము. (రాగి) కాంస్యభస్మము (కంచు) రజితభస్మము (వెండి) పాదరసభస్మము, మైలతుత్థము, పాలతుత్థము, ఇంగిలీకము, మాని పసపు, నాభి, శంఖ భస్మము, కటుకరోహిణి సమభాగములుచేసి హంసపాదియాకు రసముతో పదిజాములు నూరి కణికలుచేసి సమయమునుబట్టి నీళ్ళు మొదలయిన అనుపానములతో నూరి కనుల కుబట్టించినయెడల ఎంతకఠినపు నేత్రరోగములయినను వెంటనే నివారింపును.

## 25 భుజగాంజనము.

ఉ. పాలిడిసీసభస్మ మొకపాలు మణిశ్శిలపాళ్ళు రెండుగాఁ
గ్రాలుమయూరతుత్థమిడి కప్పురముం దగుకొద్ది కల్పియుం
జాలఁగఁదుమ్మిపూవులరసమ్మున నూరి యుఁగన్నులందిడం
బూలును వర్తిరోగములుఁ బొక్కులు మానురమేశ కేశవా.

టీ. రమేశ=లక్ష్మీనాయకా, కేశవా=ఓవిష్ణుమూర్తీ! సీస భస్మము, పాలిడి= ఒకపాలుంచి, ఒకపాలు మణిశ్శిల, పాళ్ళు రెండుగాన్=రెండు భాగములుగా- క్రాలు= ప్రశస్తమగు, మయూర తుత్థ మిడి= మయిలుతుత్థ ముంచి, తగు కొద్ది=తగు మాత్రము, కప్పురమున=అరతి కర్పూరమును, కల్పియున్=కలిపి, చాలగన=చాలునట్లు, తుమ్మిపూవులరసమ్మునన=తుమ్మిపూవులరసముతో, నూరి =మర్దించి, కన్నులందిడన= నేత్రములకుఁబట్టించినయెడల, పూలును=పువ్వులను, వర్తిరోగములు=గ్రుడ్డుపొరలలోనిజబ్బులును, పొక్కులు, మానున=మానిపోవును.

తా. ఒకపాలుసీసభస్మము ఒకపాలుమణిశిల, రెండుపాళ్ళు మైలుతుత్తము, తగు మాత్రము అరతికర్పూరముకలిపి తుమ్మిపూవుల రసముతోనూరి కనులకుఁబట్టించినయెడల పువ్వులును, పొరలలోనిజబ్బులును, పొక్కులును మానిపోవును.

26 తుత్థాంజనము*

సీసమాలిక.

మాయూరతుత్థంబు మజ్జియూడలు యష్టి
మధుక శంఖంబులు మ్రానిపసపు
కటుకత్రయంబును కానుగవిత్తులు
గంధకమ్మును దాళకమ్ము రసము
వాయివిళంగముల్ వసయు సైంధవలవం
గములను నీలాంజనమును పాల
తుత్తంబునుం జిల్లవిత్తు లామలకంబుఁ
బరిశుద్ధమౌ తామ్రభస్మలోహ
ములుఁ దుల్యమగు భాగములుగాఁగ నిడి మాది
ఫలరసంబున నూరి బాగుమీఱఁ
గణికలుగావించి గాలుపారఁగఁ జేసి
జలములతో నేత్రములను వేయ
నిట్టి తుత్థాంజనమ్ముచే నెట్టి దుష్ట
నేత్రకాచలుఁ బువ్వులు నిఖిలరోగ
బాధలును బోవు శ్రీలోల భక్తపాల
బాలగోపాల గుణశీల భర్మచేల.

టీ. గుణశీల=సద్గుణస్వభావముకలవాఁడా! భర్మచేల=బంగరుబట్టగలవాఁడా! భక్తపాల=భక్తులను రక్షించువాఁడా! శ్రీలోల=లక్ష్మీదేవియందాసక్తిగలవాఁడా! బాలగోపాల=ఓ బాలకృష్ణమూర్తీ! మాయూరతుత్థంబు=మైలుతుత్థము- మజ్జియూడలు-యష్టిమధుక- శంఖంబులు=యష్టిమధుకము- శంఖభస్మము- మ్రానిపసపు- కటుకత్రయంబును=శొంఠిపిప్పలిమిరియములును కానుగవిత్తులు- గంధకమ్మును- తాళకమ్ము=తాళకమును- రసము=పాదరసము- వాయివిళంగముల్=వాయివిళంగములును- వసయు-సైంధవలవంగములును=సైంధవలవణము- లవంగములును- నీలాంజనమును- పాలతుత్తంబునున్=పాలతుత్తమును - చిల్లవిత్తులు=ఇండుపగింజలు - ఆమలకంబున్=ఉసిరికపప్పును- పరిశుద్ధమౌ= మిక్కిలిశుభ్రమగు- తామ్రభస్మలోహములున్=తామ్రభస్మము- లోహభస్మమును- తుల్యమగు=సమానమగు- భాగములుగాఁగన్ పాళ్ళుగా-ఇడి=ఉంచి- మాదీఫలరసంబునన్=మాదీఫలరసముతో- బాగుమీఱన్=చక్కఁగా- నూరి=మర్దించి- కణి

కలుగావించి=కణికలుచేసి- గాలుపారఁగఁజేసి=నీడనారునట్లుచేసి- జలములతోన్=నీళ్ళతోఁ రుగఁదీసి- నేత్రములను వేయన్=కనులకుఁబట్టించినయెడల- ఇట్టి=ఈమీఁదచెప్పిన తుత్థాంజనమ్ముచేన్=తుత్థాంజనమనుపేరుగలకాటుకచే- ఎట్టికష్టనేత్రకాచలున్=ఎటువంటికష్టతరమగు నేత్రకాచరోగములైనను - పువ్వులు - నిఖిలరోగబాధలును=మఱియు సమస్తమయిన నేత్రవ్యాధులును, పోవున్=మానును.

తా. మైలుతుత్తము, మజ్జిరియూడలు, యష్టిమధుకము, శంఖభస్మము, గ్రామానిపసపు, శొంఠిపిప్పలిమిరియములు, గానుగగింజలు, గంధకము, తాళకము, పాదరసభస్మము; వాయువిళంగములు, వస, సైంధవలవణము, లవంగములు, నీలాంజనము, పాలతుత్తము, ఇండుపగింజలు, ఉసిరికపప్పు, మంచి తామ్రభస్మము, లోహభస్మము, సమానభాగములు చేసి, మాదీఫలరసముతో నూరి కణికలు చేసి నీడనారించి, నీళ్ళతో నూరి, కనులకుఁబట్టించినయెడల అసాధ్యములగు కాచరోగములు, పువ్వులు మొదలయిన నేత్రవ్యాధులన్నియును మానును.

## 27. లోహాంజనము.

### సీసమాలిక.

జలధిఫేనముర సాంజనమునుబటికను
రెండుదంబుఁదాఁబేటివీపుపెంకు
సరిగూర్చివానికిసరిర క్తమణిశిల
యిడిమణిశిలకునిబ్బడికటుకత్ర
యమిడియాకటుకత్రయముకిబ్బడిగసింధు
లవణంబునాసింధులవణమెత్తు
లోహంబుగూర్చియాలోహమెత్తతివస
గలిపియన్నియులెస్సకలియనేయి
నైననుబువుతేనెనైననునలుగంగఁ
జేసికరాటానఁదీసిదాచి
కన్నులఁబెట్టినఁగాచలులోచన
వాతమ్ములునుబక్ష్మఘాతములును
దురదబెరుపులునిరుకులుపొరలునేత్ర
గండమాలలుపువ్వులఁబుండ్లడఁగు

నిట్టిలోహాంజనమ్ము చేనిందిరేశ
కలుషభయనాశనిఖిలలోకప్రకాశ.

టీ. కలుషభయనాశ=పాపభయము బోగొట్టువాఁడా! నిఖిలలోకప్రకాశ= సమస్తలోకములయందుఁ బ్రకాశించువాఁడా! అని గాని- లేక- సమస్తలోకములకు వెలుగునిచ్చువాఁడా! ఇందిరేశ=లక్ష్మీనాథుఁడవగు విష్ణుమూర్తీ! జలధిఫేనము=సముద్రపునురుగు- రసాంజనమును=ఇంగిలీకమును- పటిక, కుర్విందంబున్=కురువిందమును- తాఁబేటివీపు పెంకు- సరిగూర్చి=సమానభాగములుచేసి- వానికి=పయిన చెప్పినవానికి- సరి=సమానముగా- రక్తమణిశిల- ఇడి=చేర్చి- మణిశిలకు-ఇబ్బడి=రెండురెట్లు- కటుకత్రయము=శొంఠిపిప్పలిమిరియములు- ఇడి=చేర్చి- ఆకటుకత్రయమునకు=ఆశొంఠిపిప్పలిమిరియములకు- ఇబ్బడిగన్=రెట్టింపుగా- సింధులవణంబు=సైంధవలవణంబు- ఆసింధులవణమెత్తు=ఆసైంధవలవణమెత్తు- లోహంబుఁగూర్చి=లోహభస్మమును జేర్చి- ఆలోహమెత్తు- అతివసగలిపి, అన్నియున్=అన్నియును- లెస్సకలియన్=చక్కఁగాఁగలియునట్లు- నేయినైనను=నేతితోనైనను- పువుతేనెనైనను=పువ్వుతేనెతోనైనను- నలుగంగఁజేసి=నలుగునట్లుచేసి- కరాటానన్=బరణియందు- దాచి- కన్నులఁబెట్టినన్=కనులకుఁ బట్టించిన యెడల- కాచలు- లోచనవాతమ్ములు=నేత్రవాతములును- పక్ష్మఘాతములును=రెప్పజబ్బులును- దురదలు- ఎరుపులు, ఇరుకులు- పొరలు- నేత్రగండమాలలు పువ్వులున్= పువ్వులును- పుండులు=పుండ్లును- ఇట్టిలోహాంజనమ్ము చేన్=ఈచెప్పిన లోహాంజనమును కాటుకతో- అడగున్=అణఁగిపోవును.

తా. సముద్రపునురుగు, ఇంగిలీకము, పటిక, కురువిందము, తాబేటివీపు పెంకు, సమానభాగములు చేర్చి వీనికిసమానముగా రక్తమణిసిల చేర్చి, మణిశిలకు రెట్టింపు శొంఠి పిప్పలి మిరియములు చేర్చి, ఆశొంఠిపిప్పలిమిరియములకు రెట్టింపు సైంధవలవణము, సైంధవలవణమెత్తు లోహభస్మమును జేర్చి, ఆలోహభస్మమెత్తు అతివసగలిపి అన్నియును గలియునట్లు చక్కఁగా నేతితోనైనను, తేనెతోనైనను నూరి బరిణియందుంచి దాచి కనులకుఁ బట్టించినయెడల కాచలు, నేత్రవాతములు, రెప్పజబ్బులు దురదలు, ఎరుపులు, ఇరుకులు, పొరలు, నేత్రగండమాలలు, పువ్వులు, పుండ్లు, మానిపోవును.

## 28 లఘునారికేళాంజనము.

సీ. పగడముల్ గవ్వలుఁ బచ్చకర్పూరంబు
ముత్తియంబులు జిల్లవిత్తనములు
గరకవిత్తులపల్కులిరుతుత్తములునుసీ
లాంజనమ్ము సమాంశలరసికూర్చి

టెంకాయనీళ్ళచేఁబొంకమ్ముగామూఁడు
దినములుమర్దించితీసికణిక
లొనరించివనితలచనుబాలనిమ్మపు
ల్సునఁదీసికన్నులనొనరవేయ
సకలనేత్రరుజమ్ములుశాంతినొందుఁ
బూలుకాయలుఁబొక్కులుఁబొరలుమాను
నమరనీనారికేళాంజనముననీశ
భానుజాధీశదుర్భవభయవినాశ.

టీ. భానుజాధీశ=కాళిందీదేవికి ప్రభువయినవాఁడా! దుర్+భవభయ=దుష్ట సంసారభయమును, వినాశ=పోగొట్టువాఁడా, ఈశ=దైవమగు కృష్ణా. పవడముల్=పగడభస్మము, గవ్వలు=వరాటభస్మము. పచ్చకప్పురంబు=పచ్చకర్పూరమును- ముత్తియంబులు=ముత్యభస్మము, చిల్లవిత్తనములు=ఇండుపగింజలు కరకవిత్తులపల్కులు=కరకకాయగింజలపలుకులును, ఇరుతుత్తములును=పాలతుత్తము, మైలుతుత్తమును, నీలాంజనమ్ము=నీలాంజనమును, సమాంశలు=సమానభాగములు, అరసికూర్చి=ఆలోచించిచేర్చి- టెంకాయనీళ్ళచేత=కొబ్బరికాయనీళ్ళచేత పొంకమ్ముగాన్=చక్కఁగా- మూఁడుదినములు- మర్దించితీసి=నూరితీసి- కణికలొనరించి=కణికలుగాఁజేసి, వనితలచనుబాలన్=స్త్రీలచనుబాలచేతను- నిమ్మపుల్సునన్=నిమ్మపండ్లరసముతోను, తీసి=అరగఁదీసి, కన్నులనొనరవేయన్=నేత్రములకుఁ జక్కఁగాఁబట్టించఁగా,సకలనేత్రరుజమ్ములు=సమస్తమయిన కంటిజబ్బులును, శాంతినొందున్=నివారణయగును. పూలున్=పువ్వులును,కాయలు, పొక్కులు, పొరలు, అమరన్=చక్కఁగా- మానున్=మానును.

తా. పగడభస్మము, వరాటభస్మము, పచ్చకర్పూరము, ముత్యభస్మము, ఇండుపగింజలు, కరకకాయగింజల పలుకులు, పాలతుత్తము, మైలుతుత్తము, నీలాంజనము, ఇవి సమభాగములుచేసి కొబ్బరికాయనీళ్ళతో మూడుదినములునూరి కణికలుచేసి స్త్రీలచనుబాలతోను, నిమ్మపండ్లరసముతోను అరగదీసి కనులకుఁ బట్టించినయెడల నేత్రరోగములన్నియును, పువ్వులు, కాయలు, పొక్కులు, పొరలు, మానును.

## 29 మహానారికేళాంజనము.

### సీసమాలిక.

సీ. ప్రమానిపసపుయష్టిమధుకంబుత్రిఫలముల్
వేరువేరుగఁబావుశేరులుగను

కూరిచి వేగొట్టి కుంచెడు టెంకాయ
 నీళ్లలోపల వేసి నేర్పుతోడ
నష్టభాగము చిక్కునటు కాచి చీరను
 వడపోసి వేరొక్క కడవ నునిచి
సన్నపుమంటను చక్కఁగా దిగఁగాచి
 దించి చల్లార్చి యందంచితముగ
నారతి కర్పూర మబ్ధిఫేనము రసాం
 జనము సైంధవమును జాజుఱాయి
మైలుతుత్థమ్ము మిర్యాలును మాచెత్తున
 నల్లనూరియు గల్వనాల్లు కూడ
లెత్తు తేనియఁ గల్పసీమహానారికే
 ళాంజనం బెంతయు నదనెజింగి
కన్నులఁ బెట్టినఁ గాచలుఁ బటలముల్
 కాయలు గ్రంథులు కామెరలును
నిరుకు లెరుపులుఁ దిమిరముల్ పొరలుఁ బూలు
మంటలంటులు మైలలు కంటిదూల
మాదలును మానుశిశుపాలమదవిఘాల
వేణుగోపాలరుక్మిణీప్రాణలోల.

టీ. శిశుపాల= శిశుపాలుఁడను రాక్షసుని యొక్క- మద= గర్వమును- విఘాల= తెగఁగొట్టినవాఁడా! రుక్మిణీప్రాణలోల= రుక్మిణీదేవికి యిష్టుఁడైనవాఁడా! వేణుగోపాల= ఓవేణుగోపాలమూర్తీ! మ్రానిపసపు- యష్టిమధుకంబు- త్రిఫలముల్= కరకతాడి యుసిరికలును- వేరువేరుగన్= వేరువేరుగా- పావుశేరులుగను= పావుశేరు ప్రమాణముగ- కూరిచి= చేర్చి- వేగొట్టి= గట్టిగా దంచి- కుంచెడు టెంకాయనీళ్ళలోపల వేసి- నేర్పుతోడన్=ఉపాయముతో- అష్టభాగము=ఎనిమిదవవంతు- చిక్కునటులన్= ఉండునట్లు- కాచి- చీరను వడపోసి=వస్త్రముతో వడియఁగట్టి- వేరొక్క కడవను నిచి=ఇంకొక కడవయందుఁ బోసి- సన్నపుమంటను- చక్కఁగా- దిగఁగాచి- దించి- చల్లార్చి- అందు=ఆకషాయమందు- అంచితముగన్=ఒప్పునట్లు- ఆరతికర్పూరము- అబ్ధిఫేనము=సముద్రపునురుగు- రసాంజనము=ఇంగిలీకము- సైంధవమును=సైంధవలవణమును, జాజుఱాయి=జేగురుఱాయియును, మైలుతుత్థమ్ము=మైలుతుత్తమును- మిర్యాలు=మిరియము

లును- మాడెత్తునన్ =మాడమాడవంతున, నల్గనూరియున్ =నలుగునట్లునూరి- నాల్గుమాడ లెత్తు- తేనియన్ = తేనెను- కల్పన్ =కల్పగానయిన, ఈ హానారికేళాంజనంబు, ఎంతయున్ =మిక్కిలి- అదనెఱింగి=సమయమునాలోచించి, కన్నులఁబెట్టినన్ =కనులకుఁ బట్టించినయెడల- కాచలు=కాచరోగములును, పటలముల్ =కృష్ణ, శుక్ల, పీత, రక్త వర్ణంబులుగల పటలరోగంబులును- కాయలు, గ్రంధులు=రెప్పలపైవేయు ముడుల వంటి బొబ్బలును, కామెరలును, ఇరుకులు, ఎరుపులు, తిమిరముల్ =చీఁకట్లును, పొరలు, పూవులు=పువ్వులును, మంటలు, అంటులు=అంటుకొనుటలు, మైలలు=కంటి మబ్బులును, కంటిదూల=కంటిదురదయు, మాదలును=మాదరోగములును, మానున్ =నివర్తించును.

తా. మానిపసపు, యష్టిమధుకము, కరకతాడియూసిరికలు, వేరువేరుగా పావుశేరుచొప్పునగూర్చి నలుగఁగొట్టి కుంచెడు టెంకాయ నీళ్ళలోఁబోసి ఎనిమిదవవంతు నీళ్ళు మిగులునట్లుకాచి,గుడ్డనువడియఁగట్టి వేరొకకడవలోఁబోసి సన్నపుమంటనుకాచి దించి చల్లార్చి యందు, ఆరతీకర్పూరము, సముద్రపునురుగు ఇంగిలీకము, సైంధవలవణము, జేగురుబొంది, మైలుతుత్తము, మిరియాలు, మాడెత్తుమాడెత్తుచొప్పున నలగనూరి కలిపి నాలుగుమాడలెత్తు తేనెగలిపి, సమయముదెలిసికొని యీయంజనమును గనులకుఁబెట్టినయెడల, కాచలు, పటలములు, కాయలు, గ్రంధులు కామెరలు, ఇరుకులు, ఎఱుపులు, తిమిరములు, పొరలు, పువ్వులు, మంటలు, అంటులు, మైలలు, దురదలు, మానును.

## 30. నిశాంజనము.

చ. వసమిరియాలుమానిపసపుబాగుగఁబిప్పలిసైంధవంబులిం
పెసఁగఁగనాల్గుదిన్సులొకయెత్తుగఁగూరిచికల్గరాకుబ
లసమునసూరినేతనొనరంగనిశాంజనమక్షులందిడం
బుసులునుజీకటుల్పటలపుంజమణంగునుపార్థసారధీ.

టీ. పార్థసారధీ=అర్జునునకు రథసారథ్యముచేసిన కృష్ణా! వస,మిరియాలు- మానిపసపు=మానిపసపును- బాగుగన్ =చక్కఁగా- పిప్పలిసైంధవంబులు=పిప్పలికట్టె సైంధవలవణము- ఇంపెసఁగఁగన్ =తగునట్లు- నాల్గుదిన్సులు=ఈ చెప్పిన నాలుగువస్తువులును- ఒకయెత్తుగఁగూరిచి=సమభాగముల్ చేసి- కల్గరాకుబల్ రసమునన్ =ప్రశస్తమగు గుంటకలగరాకురసముతో- నూరి=మర్దించి- నేతన్ =నేతితోఁగలిపి- ఒనరంగన్ =ఒప్పునట్లు (అనఁగా దగినట్లు) నిశాంజనము- అక్షులందిడన్ =నేత్రములకుఁ బట్టించినచో- పుసులును- చీకటుల్ =చీకట్లును- పటలపుంజము=పటలరోగసముదాయమును- అడంగున్ =నివారించును.

తా. వస, మిరియాలు, మానిపసపు, పిప్పలికట్టె, సైంధవలవణము, సమానభాగములుచేసి గుంటకలగరాకురసముతోనూరి నేతితోఁగలిపి కనులకుఁబట్టించినయెడల పుసులు, చీకట్లు, పటలరోగములుమానును.

## 31 లఘుమరీచాంజనము.

ఆ. నల్లమేకచేదునల్లనిమిర్యాలుఁ
గలియనూరిగట్టికణికజేసి
కన్నులందుఁబెట్టఁగానేత్రరోగముల్
పుసులునసలుమానుభుజగశయన.

టీ. భుజగశయన=సర్పశాయియగు నోవిష్ణుమూర్తీ! నల్లమేకచేదు=నల్లగా నుండు మేకయొక్క చేదుకట్టును, నల్లని మిర్యాలున్=నల్ల మిరియములును, కలియన్=కలియునట్లు, నూరి=నదిరించి, గట్టి కణికజేసి, కన్నులందుఁ బెట్టఁగాన్=కనులకుఁ బట్టించినయెడల, నేత్రరోగముల్=కనులజబ్బులగు పుసులు, నసలు=దురదలును, మానున్=మానును

తా. నల్లమేక చేదుకట్టు, నల్లమిర్యములు కలియనూరి గట్టికణికలుచేసి కనులకుఁ బట్టించినయెడల పుసులు, దురదలు పోవును.

## 32 త్రికటుకాంజనము.

క. త్రికటుకమును త్రిఫలంబును
బ్రకటితముగ నల్లమేకపంచితమిడి వీ
డక జాముసూరియది యు
త్సుకతం గన్నులకుఁ బెట్టశుక్లములణఁగున్.

టీ. త్రికటుకమును=శొంఠిపిప్పలిమిరియములును, త్రిఫలంబున్=కరకతాడియుసిరికలును, ప్రకటితముగన్=ఏర్పాటుగా, నల్లమేకపంచితమిడి=నల్లమేకయొక్క నీరుడిచిపోసి, వీడక=విడువక, జామునూరి=ఒకజాము మర్దించి, అది=ఆయంజనము, ఉత్సుకతన్=సంతోషముతో, కన్నులకుఁబెట్టన్=కనులకుఁ బట్టించినయెడల, శుక్లములు=శుక్లపిళ్ళములను కనులలో నెత్తురులేక పాలిపోవుటలు, అణఁగున్=నివర్తించును.

తా. శొంఠిపిప్పలిమిరియములు, కరకతాడియుసిరికలు, నల్లమేకపంచితము పోసి, విడువక జాముసేపునూరి యాయంజనమును గనులకుఁ బెట్టినయెడల కనులలో నెత్తురులేక పాలిపోయెడి శుక్లరోగములుమానును.

## 33 సుకుమారాంజనము.

సీ. వినురేకుతాళకమ్మునురక్తమణిశిల
పసుపుమిర్యమ్ములుఁబటికశంఖ
గంధసారమ్ములుసైంధవలవణంబు
సమభాగములుగూర్చిజంబుఫలపు

సారంబుతోనూరిసరవిగాఁగణికలు
గావించిగాల్పార్చికన్నుగవల
నారూఢిసీసుకుమారాంజనమువేయ
మసకలుమలినముల్పుసులుఁబొరలు



నసిమిరులునీరుగారెడినయనములును
మంటలెరుపులుభ్రమలుదుర్మాంసములును
గంటిపువ్వులుమానునుగరుడవాహ
ప్రజలకెల్లనునానందభరితముగను.

టీ. గరుడవాహ=గరుత్మంతుడు వాహనముగాఁ గల విష్ణుమూర్తీ! విను=ఆకర్ణింపుము, రేకు తాళకమ్మును=రేకులవలెనుండు హారిదళమును, రక్త మణిశిల=ఎఱ్ఱ మణిశిలయు, పసపు, మిర్యమ్ములు=మిరియములును, పటిక, శంఖ గంధ సారమ్ములు=శంఖభస్మము, చందనము, సైంధవలవణంబు, సమభాగములుగూర్చి=సమానభాగములు చేసి జంబుఫలపు సారంబుతోన్ =నేరేడుపండ్ల రసముతో, నూరి=మర్దించి, సరవిగాన్= చక్కఁగా, కణికలుఁ గావించి=కణికలుగాఁ జేసి, గాల్పార్చి=నీడ నారబెట్టి, ఆరూఢిన్=నిశ్చయముగా, ఈసుకుమారాంజనము, కన్నుగవలన్ =నేత్రములకు, వేయన్=పట్టించినయెడల, మసకలు, మలినముల్,=మలినములును, పుసులున్=పుసులును, పొరలు, నసిమిరులు=దురదలు, నీరుగారెడి నయనములును=నీరుగారు కంటిజబ్బులును, మంటలు ఎరుపులు, భ్రమలు=తిరుగుట, దుర్మాంసములును,కంటిపువ్వులును, ప్రజలకెల్లన్=జనుల కందఱికిని, ఆనందభరితముగను=సంతోషము నిండునట్లు, మానున్=నివర్తించును.

తా. రేకుతాళకమును, రక్తమణిశిల, పసపు, మిరియములు, పటిక, శంఖభస్మము, చందనము, సైంధవలవణము, సమభాగములుచేసి నేరేడుపండ్లరసముతో నూరి కణికలుచేసి, నీడనారఁబెట్టి కనులకుఁ బట్టించినయెడఁ, మసకలు, మలినములు, పుసులు, పొరలు, దురదలు, నీరుగారుట, మంటలు, ఎరుపులు, తిరుగుట, దుర్మాంసములు, పువ్వులు మానును.

## 34 తామ్రాంజనము.

సీ. ఘనతామ్రభస్మంబుఁగరకకాయలజీడి
గింజలమసియునుమంజులముగ
వెన్నతోఁదళియపైవేసియురాగిముం
తనుమర్దనలుజేసిజనులకెల్లఁ

గన్నులఁబుట్టురోగంబులు కామెర
లమ్మదకన్నులుదూలమాదతిమిర
మాదలుమాదదుర్మాంసంబు రేఁజీఁకు
నీళ్ళుగారెడికనుల్ నిలుపుకనులు
నేత్రవాతంబు లెరుపులు నేత్రశూల
పక్షఘాతశిరోవాతభగ్నవాత
కామిలావాతశూలలు గ్రంధులక్షి
గండమాలలుమఱిలూతికలునణంగు.

టీ. ఘనతామ్రభస్మంబునన్=మంచితామ్రభస్మమును, కరకకాయల=కరకకాయలయొక్కయు, జీడిగింజల= జీడిగింజలయొక్కయు, మసియును' మంజులముగన్=చక్కఁగా, వెన్నతోన్=వెన్నతోడ, తళియపైన్=పళ్ళెముమీఁద, వేసియూ=ఉంచి, రాగిమంతను=రాగిచెంబుతో, మర్దనలుచేసి=నూరి, జనులకెల్లన్=మనుజులకందఱికి, కన్నులఁబుట్టు=కనులయందుఁబుట్టునట్టి, రోగంబులు=జబ్బులగు, కామెరల్=కామెరలును, మాదకన్నులు=కంటిమాదలును, దూలమాద=దురదమాదయు, తిమిరమాదలు=తిమ్మిరిమాదలును, మాదదుర్మాంసంబు=దుర్మాంసపుమాదలును, రేఁజీఁకు=రేఁజీఁకటియును, నీళ్ళుగారెడికనుల్=కనులనుండి నీళ్ళుగారుటయు, నిలుపుకనులు=రెప్పమూతపడని రోగములును, నేత్రవాతంబులు=కంటికిఁగల్గువాతములును, ఎరుపులు, నేత్రశూల, పక్షఘాత=పక్షఘాతములును, శిరోవాత=శిరోవాతములు, భగ్నవాత=భగ్నవాతములును, కామిలావాతశూలలు, గ్రంధులు=రెప్పలమీఁదవేయు ముడులవంటికాయలు, గండమాలలు=గండమాలలును, మఱి= ఇంకను, లూతికలు= నేత్రలూతికలును, అణంగున్=మానిపోవును.

తా. తామ్రభస్మము, కరకకాయలమసి, జీడిగింజలమసి, వెన్నతో పళ్ళెముమీఁద వేసి రాగిమంతతో నూరి కనులకుఁ బట్టించినయెడల, పైనఁజెప్పఁబడిన రోగము లన్నియును మానును.

## 35 రజతాంజనము.

ఆ. వెండిపందికొమ్ము వెలయ నేనుఁగుగోరుఁ
గోడిగొంతుకెముకఁ గూర్చిసరిగఁ
దేనెతోడనూరి పూనికన్నులఁబెట్టఁ
బూలుఁబటలచయముఁ బోలియుఁగృష్ణ.

టీ. కృష్ణ= ఓకృష్ణమూర్తీ, వెండి= రజతభస్మము, పందికొమ్ము, వెలయన్= ప్రకాశించునట్లు, ఏనుఁగుగోరున్= ఏనుఁగుగోరును, కోడిగొంతుకెముకన్= కోడిగొంతులోని యెముకను, సరిగన్= సమానభాగములుగా, కూర్చి= చేర్చి, తేనెతోడన్= తేనెతోడను, నూరి= మర్దించి, పూని= నిండుమనస్సును వహించి, కన్నులఁబెట్టన్= నేత్రములకుఁ బట్టించినయెడల, పూలు= పువ్వులు, పటలచయమున్= పటలరోగసమూహాయమును, పొలియున్= నశించును.

తా. రజతభస్మము, పందికొమ్ము, ఏనుఁగుగోరు, కోడిగొంతులోని యెముక, సమానభాగములుచేసి, తేనెతోనూరి కనులకుఁ బెట్టినయెడల, పువ్వులు, పటలరోగములు నశించును.

## గద్యము.

ఇది, శ్రీవేణుగోపాల చరణ ధ్యానపరాయణ శ్రీవత్సగో
త్రోద్భవ తాడేపల్లి రంగామాత్య పుత్ర బాలగో
పాల ప్రసాదలబ్ధ సకలవిద్యాప్రవీణ పాన
కాల రాయప్రణీతంబయిన, నేత్రద
ర్పణంబు సర్వంబును
సంపూర్ణము.



